జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు





(తొమ్మిది కలములు -అన్ని మతాల సారాంశం)

Telugu

జ్ఞాని పురుష్ దాదా భగవాన్ నిర్వచించిన

# భావనతో మెరుగుపడతాయి జన్మ–జన్మలు

(తొమ్మిది కలములు –అన్ని మతాల సారాంశం)

మూలం - గుజరాతి

సంకలనం - డా. నీరూ బెహన్ అమీన్

తెలుగు అనువాదం - మహాత్మాగణం

# త్రిమంత్రం

(సర్వ విఘ్న నివారణ చేసే మంత్రం)





నమో అరిహంతాణం

నమో సిద్ధాణం

నమో ఆయరియాణం

నమో ఉవజ్ఝాయాణం

నమో లోయే సవ్వ సాహూణం

ఏసోపంచణమోక్కారో,

సవ్వాపావప్పణాసణో

మంగళా ణం చ సవ్వేసిం,

పడమం హవయీ మంగళం

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో శివాయ

జై సచ్చిదానంద





## దాదా భగవాన్ ఎవరు?

జూన్ 1958లో, ఒక సాయంత్రం 6 గంటల సమయంలో, జనసమూహంతో రద్దీగా ఉన్న సూరత్ స్టేషన్‌లోని మూడవ నెంబరు ప్లాట్‌ఫాం బెంచిపైన కూర్చుని ఉన్న అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్ యొక్క దేహమందిరంలో సంపూర్ణ రూపంలో 'దాదా భగవాన్' సహజంగా వ్యక్తమయ్యారు! ప్రకృతి ఆధ్యాత్మికత యొక్క అద్భుతమైన ఆశ్చర్యాన్ని వెల్లడించింది! ఒక గంట వ్యవధిలో, ఆయనకి విశ్వదర్శనం అయింది! 'మనం ఎవరం? దేవుడు ఎవరు? ప్రపంచాన్ని ఎవరు నడుపుతారు? కర్మ ఏమిటి? విముక్తి అంటే ఏమిటి?', వంటి అన్ని ఆధ్యాత్మిక ప్రశ్నల రహస్యాలు బయటపడ్డాయి! ఈ విధంగా ప్రకృతి, విశ్వానికి ఒక అద్వితీయమైన పూర్తి దృష్టిని అందించింది, మరియు దీనికి మాధ్యమం అయ్యారు, శ్రీ అంబాలాల్ మూల్‌జీ భాయ్ పటేల్, గుజరాత్ లోని చరోథర్ యొక్క భాద్రన్ గ్రామంలోని పాటీదారు, కాంట్రాక్టర్ వ్యాపారం చేస్తున్నప్పటికీ, పూర్ణ వితరాగ పురుషుడు!

'వ్యాపారంలో ధర్మం ఉండొచ్చు కానీ ధర్మంలో వ్యాపారం ఉండకూడదు' అనే సిద్ధాంతంతో ఆయన జీవితం అంతా గడిపారు. జీవితంలో ఎప్పుడూ కూడా ఆయన ఎవరి దగ్గరా డబ్బులు తీసుకోలేదు. అంతే కాకుండా వ్యాపారంలో సంపాదించిన దానితో భక్తులను యాత్రకు తీసుకొని వెళ్లేవారు.

ఆయనకు ప్రాప్తమైన విధంగానే కేవలం రెండు ఘంటలలో, వేరేవారికి కూడా జ్ఞాన ప్రాప్తి కలిగించే శక్తిని పొందారు! దీన్నే అక్రమ్ మార్గంగా అభివర్ణించారు. అక్రమ్ అంటే క్రమం లేకుండా, మరియు క్రమ్ అంటే ఒక్కో మెట్టు పైకి ఎదగడం! అక్రమ్ అంటే స్టెప్-లెస్, షార్ట్‌కట్, ఎలివేటర్ మార్గం!

ఆయన స్వయంగా ప్రతి ఒక్కరికి 'దాదా భగ్వాన్ ఎవరు?' అనే దానిని వివరిస్తూ ఇలా అనేవారు, "నీ ముందు కనిపించేవాడు దాదా భగవాన్ కాదు. ఇక్కడ కనిపించేది 'ఏ. ఎం. పటేల్'. నేను జ్ఞాని పురుషుడను మరియు లోపల ప్రకటించింది దాదా భగవాన్. దాదా భగవాన్ పద్నాలుగు లోకాల నాథుడు, అతను మీలో మరియు ప్రతి ఒక్కరిలో కూడా ఉన్నాడు. మీలో అవ్యక్త రూపంలో ఉన్నాడు, మరియు 'ఇక్కడ' సంపూర్ణ రూపంలో వ్యక్తమయ్యాడు! నేను భగవన్తుడిని కాను. నా లోపల వ్యక్తమైన దాదా భగవాన్ని నేను కూడా నమస్కరిస్తాను."



# అనువాదకుని విజ్ఞప్తి

అంబాలాల్ ఎమ్. పటేల్ నామధేయులైన జ్ఞానిపురుషుడిని దాదాశ్రీ, లేక దాదా లేక దాదాజీగా భక్తులందరూ పిలుస్తారు. ఆత్మ విజ్ఞాన సంబంధమైన మరియు ప్రపంచ వ్యవహార జ్ఞాన సంబంధమైన తన సత్సంగాన్ని యథాతథంగా అనువదించటం సాధ్యం కాదని ఆయన తరచూ చెప్పేవారు. అనువాద క్రమంలో లోతైన, సహేతుకమైన అర్థం ముముక్షువులకు అందకపోవచ్చు అని కూడా దాదాశ్రీ చెప్పేవారు. గుజరాతీ భాషని నేర్చుకోవటంలోని ప్రాముఖ్యతను ఆయన నొక్కి వక్కాణించేవారు. తద్వారానే దాదాశ్రీ అమూల్యమైన బోధల సంపూర్ణ సారాన్ని యథాతథంగా గ్రహించే అవకాశం ఉంటుందని దాదా మాటల సారాంశం.

అయినప్పటికీ దాదాశ్రీ తన బోధలను ఇతర భాషలలోకి అనువదించటానికి, తద్వారా ప్రపంచంలోని యావత్తు ప్రజానీకానికి అందించటానికి తమ ఆశీర్వాదాన్ని అనుగ్రహించారు. తనలో ప్రకటితమైన ఈ అక్రమ విజ్ఞానాన్ని ప్రపంచంలోని మానవాళి పొంది తమ బాధలనుంచి విముక్తి పొందాలని, జీవన్ముక్తిని అనుభవించాలని దాదాజీ యొక్క ప్రగాఢమైన వాంఛ. ఈ విజ్ఞానం యొక్క అద్భుతమైన శక్తులను ప్రపంచం గుర్తించి ప్రణమిల్లే రోజు వస్తుందని కూడా దాదాజీ చెప్పారు.

జ్ఞానిపురుషులైన దాదాశ్రీ బోధలను తెలుగుభాష ద్వారా తెలుగు ప్రజలకు అందించటం కోసం చేసిన చిన్న ప్రయత్న ఫలమే ఈ పుస్తకం యొక్క అనువాదం. యథాతథంగా అందించలేకపోయినా సత్సంగ సందేశాన్ని, భావాన్ని ఎటువంటి చెఋపు లేకుండా అందించడం కోసం ఎంతో శ్రద్ధ వహించటం జరిగింది.

అనంతమైన దాదాజీ జ్ఞాన ఖజానాకి ఇది ప్రాథమిక పరిచయం మాత్రమే. ఈ అనువాదంలో ఏమైన తప్పులు దొర్లివుంటే అవి పూర్తిగా అనువాదకులవే అని గమనించగలరు. వాటి నిమిత్తమై మేము మీ క్షమను అర్థిస్తున్నాము.



# ఆత్మజ్ఞాన ప్రాప్తికి ప్రస్తుత లింక్!

'నేను ఎంతమందికి నా చేతితో సిద్ధి కలిగించగలను. తరవాత కావాలా లేదా? తరవాత ప్రజలకు మార్గం కావలి కదా?' –దాదా భగ్వాన్

పరమ పూజ్య దాదా భగ్వాన్ (దాదాశ్రీ) జాతీయంగా మరియు అంతర్జాతీయంగా ప్రయాణించి ముముక్షులకు సత్సంగం మరియు ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించే వారు. దాదాశ్రీ తన జీవితకాలంలోనే, పూజ్య డాక్టర్ నిరుబెన్ అమిన్ (నిరుమా) కు ఆత్మజ్ఞానం ప్రాప్తి కలిగించే జ్ఞానసిద్ధిని ఇచ్చారు. అదే విధంగా, దాదాశ్రీ దేహవిలయము తరవాత నీరుమ ముముక్షులకు సత్సంగం మరియు ఆత్మజ్ఞాన ప్రాప్తి, నిమిత్త భావముతో కలిగించే వారు. పూజ్య దీపక్‌భాయ్ దేశాయ్‌కు కూడా దాదాశ్రీ సత్సంగాలు నిర్వహించే సిద్ధినిచ్చారు. ప్రస్తుతం, పూజ్య నిరుమ ఆశీస్సులతో పూజ్య దీపక్‌భాయ్ జాతీయంగా మరియు అంతర్జాతీయంగా పర్యటించి నిమిత్త రూపంలో ఆత్మజ్ఞానాన్ని అందిస్తున్నారు. ఆత్మసాక్షాత్కారం తరువాత, వేలాది మంది ముముక్షులు సంసారంలో ఉండి బాధ్యతలను పూర్తి చేస్తూనే ముక్తితో ఉండి, ఆత్మ రామానతను అనుభవిస్తున్నారు.

గ్రంథంలో ఉన్న వాణి మోక్షార్థిని గైడ్ చేస్తుంది కానీ, మోక్షం ప్రాప్తి చెందేందుకు ఆత్మజ్ఞానం పొందడం చాలా అవసరం. అక్రమ్ మార్గంలో ఆత్మజ్ఞాన ప్రాప్తి నేడు కూడా కోనసాగుతుంది. దీని కోసం ప్రత్యక్ష ఆత్మజ్ఞానిని కలవడం అవసరం. వెలిగిన దీపాన్ని తాకితేనే దీపం వెలుగుతుంది.

# తొలి పలుకు

రోజంతా, ఇంట్లో, వ్యవహారంలో లేదా మరెక్కడైనా, ప్రజలు అనడం మనం వింటూనే ఉంటాము, 'ఇలా చేయకూడదనుకుంటున్నాను, కానీ జరిగిపోతుంది! ఇలా చేయాలనుకుంటున్నాను, కానీ కుదరట్లేదు! బలమైన భావన ఉండి, చేయాలని నిశ్చయించుకున్నాను, ప్రయత్నాలు ఉన్నాయి, అయినా సరే నేను చేయలేక పోతున్నాను!'.

ప్రతి మత బోధకునికి తమ అనుసరునిపై ఉండే శాశ్వత ఫిర్యాదు, 'మీరు మేము చెప్పేది ఏమి జీర్ణించుకోవడం లేదు', అని. శ్రోతలు కూడా హతాశతో నిరుత్సాహపడి, 'ఇంత ధర్మము చేసినా సరే, ఎందుకు ప్రవర్తనలోకి రావడం లేదు! దీని రహస్యం ఏమిటి? ఏ అడ్డంకి వస్తుంది? ఆ తప్పును ఏ విధంగా అధిగమించవచ్చు?' అని ఆలోచిస్తున్నారు.

పరమ పూజ్య దాదాశ్రీ ఈ కాలం మనుషుల కెపాసిటీని చూసి, వారికి తగిన సమాధానం ఒక శాస్త్రీయ విధానంలో అందించారు. పూజ్య దాదాశ్రీ, "ప్రవర్తన ఒక ఫలితం, అది ఒక 'ఇఫెక్ట్', అయితే భావం అనేది కారణం, 'కాజ్'." అని శాస్త్రీయ వివరణ ఇచ్చారు. పరిణామములో నేరుగా మార్పు తీసుకురావడం సాధ్యం కాదు. అది కూడా శాస్త్రీయ విధానం ద్వారా మాత్రమే జరుగుతుంది. కారణం మారితే, అప్పుడు ప్రభావం దానికదే మారుతుంది! కారణాన్ని మార్చడానికి, ఈ జీవితంలో కొత్తగా భావాన్ని మార్చడం ప్రారంభించండి. ఈ భావాన్ని మార్చడానికి పూజ్యశ్రీ తొమ్మిది కలములు భావించడం నేర్పించారు. అన్ని గ్రంధాలు ఉపదేశం ఇచ్చినా సరే పరిణామం రావడం లేదు, వాటి సారాంశము పూజ్యశ్రీ తొమ్మిది కలముల ద్వారా రూట్ స్థాయి నుండి మార్పు తీసుకు రావడానికి 'కీ' ఇచ్చారు. దీనిని అనుసరించి లక్షల మంది ఈ జీవితాన్నే కాకుండా, జన్మజన్మలను మెరుగుపరచుకున్నారు! నిజంగా చెప్పాలంటే, ఈ జీవితంలో బాహ్య మార్పు రాకపోవచ్చు, కానీ ఈ తొమ్మిది కలముల భావన భావించడం ద్వారా లోపల కొత్త కారణాలు పూర్తిగా మారుతాయి, మరియు అద్భుతమైన అంతర్గత శాంతి ప్రబలంగా ఉంటుంది! ఇతరులలో లోపాలను చూడటం మానేస్తారు, మరియు అదే శాశ్వత శాంతిని తీసుకురావడం కోసం ప్రధాన కారణం అవుతుంది! మరియు అందులో కూడా చాలా మంది గత జన్మలోనే తొమ్మిది కలముల మాదిరిగానే భావనలు భావించి ఉన్నారు, వారు ఇప్పుడు ఈ జీవితంలో ఈ లింక్ ని పొంది, వెంటనే ప్రవర్తనలో మార్పు అమలులోకి తీసుకు వస్తున్నారు!

ఏదైనా సిద్ధిని ప్రాప్తి చెందేందుకు కేవలం దాని కోసం తమ లోపల ఉన్న భగవంతుని దగ్గర శక్తులు అడుగుతూ ఉండాలి, అది ఖచ్చితంగా ఫలితాన్ని ఇస్తుంది.

పరమ పూజ్య దాదాశ్రీ తన గురించి ఇలా అన్నారు, 'ఈ తొమ్మిది కలములు నా జీవితాంతం అభ్యసిస్తూ వచ్చాను, ఇవి నా సంపద. కాబట్టి, నేను నా రోజువారీ అభ్యాసాలను బయటకు వెల్లడించాను. ఇది అంతిమంగా ప్రజల సంక్షేమం కోసమే. ఈ తొమ్మిది కలములు చాలా సంవత్సరాలుగా ప్రతిరోజూ, గత నలభై సంవత్సరాలుగా నిరంతరంగా, లోపల నడుస్తూ ఉన్నాయి. వాటిని ఇప్పుడు ప్రజలకు అందిస్తున్నాను.'

చాలా మంది సాధకులకు లోపల దృఢమైన నమ్మకం ఉంటుంది, 'ఈ తొమ్మిది కలములలో ఉన్నవన్నీ నాకు తెలుసు, మరియు నాకు దానిలో ఉన్నట్లు గానే ప్రబలంగా ఉంటుంది.' కానీ మనం వారిని అడిగినప్పుడు, 'మీ ద్వారా ఎవరికైనా బాధ కలుగుతుందా?', మేము వారి కుటుంబ సభ్యులను లేదా వారికి దగ్గరగా ఉన్న వారిని అడుగుతే, 'అవును' అని చెబుతారు. దీని అర్థం ఏంటంటే, వారికి ఈ విషయం నిజంగా తెలియదని. వారికి తెలిసినవి ఉపయోగపడవు. అక్కడ, జ్ఞాని పురుషుడు తమ జీవితంలో సాధించినది, అనుభవగమ్యమైన వాణి ద్వారా ఇచ్చారు కాబట్టి అది క్రియాకారి అవుతుంది. అందువలన, ఈ భావన జ్ఞాని పురుషులు అందించిన డిజైన్‌కు అనుగుణంగా ఉండాలిబీ అప్పుడే అది ఉపయోగపడుతుంది మరియు మోక్ష మార్గంలో 'స్పీడీ ప్రోగ్రెస్' కి దారి తీస్తుంది! మరియు చివరికి వచ్చే పరిణామం ఏంటంటే, 'తన ద్వారా ఏ ఒక్క జీవికి కూడా, కొంచమైనా దుఃఖం కలగదు!' అంతే కాదు! తొమ్మిది కలముల భావనలు ప్రతి రోజు భావించడం వల్ల ఎన్నో తప్పులు కడిగి పోతాయి! మరియు మోక్ష మార్గంలో ముందుకు పురోగమిస్తారు!

**–డా. నీరుబెన్ అమీన్**

దాదా భగవాన్ నిర్వచించిన

# భావనతో మెరుగుపడతాయి జన్మ - జన్మలు

## (అన్ని మతాల సారాంశం)

## (తొమ్మిది కలములు)

### వీటి ద్వారా నాశనమవుతాయి అన్ని అడ్డంకులు!

**దాదాశ్రీ:** మీకు ఒక పుస్తకం చదవడానికి ఇస్తున్నాను. నేను మీకు పెద్ద పుస్తకాలు చదవడానికి  ఇవ్వట్లేదు. మీ కోసం ఒక చిన్నది మాత్రమే. కొంచమే చెప్పండి. కొంచం, ఇంతే.

**ప్రశ్నకర్త:** సరే.

**దాదాశ్రీ:** ఇది ఒక్కసారి చదవండి! మొత్తం చదవండి. ఈ 'ఔషదం' నేను మీకు ఇస్తున్నాను, ఇది చదివే 'ఔషదం'. ఈ తొమ్మిది కలములు (తొమ్మిది ప్రకటనలు) చదవడానికి మాత్రమేబీ ఇది 'చేయడం' అవసరమయ్యే 'ఔషధం' కాదు. మిగిలినవన్నీ, మీరు చేస్తున్నది సరైనదే. కానీ ఇది భావన భావంచే 'ఔషదం'. అందువలన, 'మేము' మీకు ఇది ఇస్తున్నాము, ఇది చదువుతూ ఉండండి. ఇది అన్ని రకాల అడ్డంకులను ఛేదిస్తుంది.

కాబట్టి, ముందుగా ఒకటి లేదా రెండు నిమిషాలు కేటాయించి ఈ తొమ్మిది కలములు చదవండి.

**ప్రశ్నకర్త:** తొమ్మిది కలములు...

1. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ యొక్క అహాన్ని కొంచం కూడా బాధపెట్టకుండా, బాధ పెట్టించకుండా లేదా ఎవరినీ బాధించడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.

నేను ఎవరైనా దేహధారి జీవాత్మ యొక్క అహాన్ని కొంచం కూడా బాధించకుండా ఉండే స్యాద్వాదమైన వాణి, స్యాద్వాదమైన వర్తన మరియు స్యాద్వాదమైన చింతన చేసే పరమ శక్తిని ఇవ్వండి.

2. హే దాదా భగవాన్! నేను ఏదైనా ధర్మము యొక్క మాన్యతను కొంచం కూడా బాధ పెట్టకుండా, బాధ పెట్టించకుండా లేదా ఎవరినీ బాధించడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.

నేను ఏదైనా ధర్మము యొక్క మాన్యతను కొంచం కూడా బాధించకుండా ఉండే స్యాద్వాదమైన వాణి, స్యాద్వాదమైన వర్తన మరియు స్యాద్వాదమైన చింతన చేసే పరమ శక్తిని ఇవ్వండి.

3. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి ఉపదేశకులు, సాధు, సాధ్వి లేదా ఆచార్యులను అవర్ణవాదం, అపరాధం, అవినయం చేయకుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

4. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ వైపు కొంచం కూడా అభావము, తిరస్కారము ఎప్పుడూ చేయకుండా, చేపించకుండా, ఎవరినీ చేయడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.

5. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మతో ఎప్పుడూ కఠోర భాష,తంతీలమైన భాష మాట్లాడకుండా, ఎవరినీ మాట్లాడేలా చేయకుండా, లేదా మాట్లాడడానికి అనుమోదించ కుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

ఎవరైనా కఠోర భాష, తంతీలమైన భాష మాట్లాడితే, నాకు మృదు-రుజు భాష మాట్లాడడానికి పరమ శక్తిని ఇవ్వండి.

6. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ వైపు, స్త్రీ, పురుషుడు లేదా నపుంసకుడు, ఏ లింగధారి అయినా సరే, వారికి సంబంధించి కొంచం కూడా విషయ-వికారానికి సంబందించిన దోషాలు, కోరికలు, చేష్టలులేదా, ఆలోచనలకు సంబంధించిన దోషాలు చేయకుండా, చేయించకుండా, లేదా ఎవరైనా చేయడానికి అనుమోదించ కుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

నాకు నిరంతరం నిర్వికారంగా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

7. హే దాదా భగవాన్! నాకు ఏ ప్రకారమైన అభిరుచులలోను లుబ్ధము కాకుండా ఉండడానికి శక్తిని ఇవ్వండి. సంరసి ఆహారం తీసుకునే పరమ శక్తిని ఇవ్వండి.

8. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ, ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా ఉన్నా, జీవించి ఉన్నా లేదా చనిపోయినా, ఎవ్వరినీ కొంచం కూడా అవర్ణవాదం, అపరాధం, అవినయం చేయకుండా, చేయించ కుండా, లేదా చేయడానికి అనుమోదించకుండా ఉండడానికి ప్రరమ శక్తిని ఇవ్వండి.

9. హే దాదా భగవాన్! నాకు జగత్కల్యాణం చేయడానికి నిమిత్తం అవ్వడానికి పరమ శక్తిని ఇవ్వండి, శక్తిని ఇవ్వండి, శక్తిని ఇవ్వండి.

(వీటిని రోజుకు మూడు సార్లు చదవండి)

మీరు 'దాదా భగవాన్' దగ్గర ఇది అడగాలి. ఇది ప్రతిరోజూ పఠించవలసిన విషయం కాదు, ఇది మీ హృదయంలో నిలిచిపోవాల్సిన విషయం. ఇది ప్రతిరోజూ ఉపయోగ పూర్వకంగా భావించ వలసిన విషయం. ఇంత వచనంలో అన్ని గ్రంథాల సారాంశం ఇమిడి ఉంది.

**దాదాశ్రీ:** అన్ని పదాలు చదివావా?

**ప్రశ్నకర్త:** అవును సార్. అన్నీ శ్రద్ధగా చదివాను.

# ఎవరి అహాన్ని దెబ్బతీయకుండా...

**ప్రశ్నకర్త:** దయచేసి మొదటి కలము యొక్క అర్థాన్ని వివరించండి...

'1. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ యొక్క అహాన్ని కొంచం కూడా బాధ పెట్టకుండా, బాధ పెట్టించకుండా లేదా ఎవరినీ బాధించడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి. నేను ఎవరైనా దేహధారి జీవాత్మ యొక్క అహాన్ని కొంచం కూడా బాధించకుండా ఉండే స్యాద్వాదమైన వాణి, స్యాద్వాదమైన వర్తన మరియు స్యాద్వాదమైన చింతన చేసే పరమ శక్తిని ఇవ్వండి.'

**దాదాశ్రీ:** ఎవరి అహం దెబ్బతిన కుండా ఉండడానికి మనం స్యాద్వాద్ వాణి (అందరిచే ఆమోదించబడే వాణి) అడగాలి. అటువంటి వాణి మనకు నెమ్మదిగా ఉత్పన్నమవుతుంది. నేను మాట్లాడుతున్న ఈ వాణి ఇలాంటి భావన భావించడం ద్వారా ఫలితంగా పొందిన వాణి.

**ప్రశ్నకర్త:** అయితే ఇందులో ఎవరి అహాన్ని బాధించకూడదు, అంటే దీని అర్థం ఎవరి అహాన్నైనా పోషించడం కాదు కదా?

**దాదాశ్రీ:** లేదు, ఇలా అహాన్ని పోషించకూడదు. ఇది కేవలం అహాన్ని దెబ్బతీయ కుండా ఉండడం. నేను చెప్పేదేమిటంటే, గాజు కప్పును విచ్ఛిన్నం చేయవద్దు. దీని అర్థం, మీరు గాజు కప్పును రక్షించాలి అని కాదు. అవి వాటంతటికి అవే రక్షించబడి ఉన్నాయి, కాబట్టి మీరు వాటిని విచ్చిన్నం చేయవద్దు. అవి వారి స్థానంలో రక్షిత స్థితిలోనే ఉన్నాయి. మీరు మీ నిమిత్తంగా విచ్చిన్నం చేయవద్దు. అవి విరిగిపోతే, వాటిని విచ్ఛిన్నం చేయడంలో మీరు నిమిత్తులుగా మారకండి. మరియు మీరు భావన భావించండి, 'నా ద్వారా ఏ ప్రాణికీ కొంచెము కూడా హాని కలగకూడదు, ఎవ్వరి అహమూ ఛిద్రం కావద్దు', ఇంత మెయింటైన్ చేయండి. ఇతర వ్యక్తిని ఉపకారిగా పరిగణించండి.

**ప్రశ్నకర్త:** వ్యాపారంలో, అవతలి వ్యక్తి యొక్క అహం దెబ్బతిన కుండా ఉండే ప్రసంగాలు ఎల్లప్పుడూ జరగవు, ఎవరో ఒకరి అహాన్ని దెబ్బతీయడం జరుగుతుంది.

**దాదాశ్రీ:** అది ఒకరి అహాన్ని బాధపెట్టినట్లుగా పరిగణించబడదు. అహాన్ని బాధ పెట్టాము అంటే ఏంటంటే, ఒక వ్యక్తి ఏదైనా చెప్పటానికి ప్రయత్నించినప్పుడు, మనం, 'చాలు, చాలు. ఏమి మాట్లాడవద్దు', అని అన్నప్పుడు. ఈ విధంగా అతని అహాన్ని దెబ్బతీయవద్దు. కాగావ్యాపారంలో, నిజానికి దెబ్బతింది అహం కాదు, అది మనసులోని బాధ మాత్రమే.

**ప్రశ్నకర్త:** కానీ అహం మంచి విషయం కాదు, కదా? అలాంటప్పుడు, దానిని బాధపెట్టడంలో సమస్య ఏమిటి?

**దాదాశ్రీ:** ప్రస్తుతం అతనే అహం (అని అతను నమ్ముతున్నాడు), కాబట్టి దానిని బాధించకూడదు. అతడే సర్వస్వం అని, అతను ఏమి చేసినా, 'నిజంగా నేనే' అని నమ్ముతాడు. అందువల్ల, మీరు దానిని బాధించకూడదు. అందుకే మీరు కుటుంబ సభ్యులను ఎవరినీ కూడా తిట్టడం లాంటివి చేయకూడదు. ఎవరి అహం దెబ్బతినకుండా చూసుకోండి. ఎవరి అహంకారాన్ని కూడా బాధపెట్ట కూడదు. ఒక వ్యక్తి యొక్క అహం దెబ్బతింటే, అతను మీ నుండి విడిపోతాడు. ఆ తరువాత, అతను మళ్ళీ మీ దగ్గరికి రాడు. మనం ఎవరితోనైనా, "నువ్వు పనికిరానివాడివి, నువ్వుఇలా, అలా", అని అనకూడదు. ఎవరినీ ఇలా తక్కువ చేయకూడదు. అవును, మీరు అతన్ని తిట్టవచ్చు. అతనిని తిట్టడానికి అభ్యంతరం లేదు, కానీ ఇష్టం వచ్చినట్లు అహంకారాన్ని గాయపరచకూడదు. అతడి తలకి తగిలినా ఇబ్బంది లేదు కానీ, అతని అహం దెబ్బ తినకూడదు. ఎవరి అహాన్ని కూడా భంగం చేయకూడదు.

మరియు పనిమనిషి పట్ల కూడా ధిక్కారం కలిగి ఉండకూడదు. తిరస్కారంతో అతని అహం దెబ్బతింటుంది. మీకు అతని సేవలు అవసరం లేకపోతే, అతనితో చెప్పండి, 'నాకు ఇప్పుడు మీ పని అవసరం లేదు,' మరియు అది అతని అహాన్ని దెబ్బతీయకపోతే, మీరు అతనికి కొంత డబ్బు (సెటిల్‌మెంట్‌గా) ఇచ్చి కూడా అతనిని తీసివేయవచ్చు. డబ్బు తిరిగి వస్తుంది, కానీ అతని అహం దెబ్బతినకూడదు. లేకపోతే, అతను ప్రతీకారం తీర్చుకుంటాడుబీ అతను విపరీతంగా ప్రతీకారం బంధిస్తాడు! ఆయన మిమ్మల్ని (ఆధ్యాత్మికంగా) పురోగమించనివ్వడు, దారిలో వస్తాడు.

ఇది నిజానికి చాలా సూక్ష్మమైన అంశం. అయినప్పటికీ, మీరు ఒకరి అహాన్ని దెబ్బతీసి ఉంటే, మీరు 'మా' (లోపల ప్రభువు) నుండి శక్తిని (ఈ కలం అనుగుణంగా) అడగండి. అంటే, జరిగినదానికి భిన్నంగా మీ అభిప్రాయం ఉంచడం వల్ల దీని బాధ్యత ఎక్కువ ఉండదు. ఎందుకంటే ఇప్పుడు దీనిపై అభిప్రాయం మారిపోయింది. అహంకారం దెబ్బతీసే 'ఒపీనియన్' ఏదైతే ఉండేదో, అది ఈ శక్తిని అడగడం వలన దీని 'ఒపీనియన్' వేరుగా మారింది.

**ప్రశ్నకర్త:** 'ఒపీనియన్' నుండి వేరు అవ్వడం అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** 'దాదా భగవాన్' (లోపల భగవంతుడు) కి అర్ధం అయిపోయింది కదా, 'ఇక ఈ అమాయకునికి ఎవరి అహాన్ని దెబ్బతీయాలనే ఉద్దేశ్యం లేదు', అని. తనకి ఎవరినీ బాధపెట్టాలనే కోరిక లేదు, అయినా సరే ఇలా జరిగిపోతుంది. కానీ ప్రపంచంలోని ప్రజలకు (ఆత్మ-సాక్షాత్కారం అవ్వని వారు), వారి కోరిక అనుగుణంగా జరుగుతున్నది. అందుకే, ఈ కలం చెప్పడం ద్వారా ఏమి జరుగుతుందంటే, మీ అభిప్రాయం (చర్య నుండి) భిన్నంగా మారుతుంది. అందువలన, మీరు ఆ సందర్భం నుండి విముక్తి పొందుతారు.

అందువల్ల, మీరు చేయాల్సిందల్లా శక్తిని అడగడం. మీరు వేరే ఏమీ చేయవలసిన అవసరం లేదు, కేవలం శక్తిని అడగాలి. ఇది అమలులోకి  తీసుకురావాల్సిన అవసరం లేదు.

**ప్రశ్నకర్త:** శక్తిని అడగాలి. అది సరే, కానీ ఎదుటివారి అహం దెబ్బతినకుండా ఉండాలంటే మనం ఏమి చేయాలి?

**దాదాశ్రీ:** లేదు, మీరు అలాంటిదేమీ చేయనవసరం లేదు. మీరు ఈ కలం ప్రకారం (శక్తి కోసం) అడగాలి, అంతే. ఇంకేమీ చేయాల్సిన పనిలేదు. ప్రస్తుతం, ఒకరి అహం ఏదైతే దెబ్బతింటుందో, అది ఫలితముగా (డిశ్చార్జిలోకి) వచ్చింది. ఇప్పుడు జరిగినది ఎప్పుడో నిర్ణయించబడింది ('డిసైడెడ్') మరియు దానిని ఆపడం సాధ్యం కాదు. దానిని మార్చడానికి ప్రయత్నించడం కేవలం తలనొప్పి మాత్రమే. కాని ఈ కలం చెప్పిన తరవాత ఇక ఏ బాధ్యత ఉండదు.

**ప్రశ్నకర్త:** మరియు అది నిజమైన హృదయంతో చెప్పాలి కదా?

**దాదాశ్రీ:** ఇదంతా నిజమైన హృదయంతోనే చేయాలి. మరియు ఇది ఎవరైతే చేస్తారో, వారు కపట హృదయంతో చేయరు, నిజమైన హృదయంతోనే చేస్తారు. అయితే ఇందులో మీ అభిప్రాయం భిన్నంగా మారిందిబీ ఇది ఒక రకమైన అత్యంత అత్యున్నతమైన విజ్ఞానం.

మీరు ఈ తొమ్మిది కలములకు అనుగుణంగా వ్యవహరించాల్సిన అవసరం లేదు, మీరు కేవలం వాటిని చెప్పాలి. మీరు కేవలం శక్తిని అడగండి, 'దాదా భగవాన్, నాకు శక్తిని ఇవ్వండి. నాకు ఈ శక్తి కావాలి.' కాబట్టి, మీరు ఆ శక్తిని పొందుతారు మరియు మీ బాధ్యత వదిలిపోతుంది. కాగా, ప్రపంచం ఎలాంటి జ్ఞానం నేర్పుతుంది? 'ఇలా చేయవద్దు'. అర్రే సోదరా, నేను చేయాలనుకోలేదు, అయినా సరే అది జరిగిపోతుంది. అందుకే మీ జ్ఞానం నాకు 'ఫిట్' అవ్వట్లేదు. మీరు చెప్పే విధానంతో ఇది భవిష్యత్తులో జరగకుండా ఆపలేదు మరియు ప్రస్తుతం జరగకుండా నిరోధించలేదు, రెండూ చెడిపోతాయి. అందువల్ల 'ఫిట్' అయ్యే విధంగా ఉండాలి.

## భావప్రతిక్రమణ్, తక్షణమే !

**ప్రశ్నకర్త:** అవతలి వ్యక్తి యొక్క అహాన్ని దెబ్బతీసినప్పుడు, ఆ సమయంలో నా అహమే చెప్తుంది కదా?

**దాదాశ్రీ:** లేదు, ఇలాంటి అర్థం తీసుకునే అవసరము లేదు. మన జాగృతి ఏమి చెబుతుంది? మన మోక్ష మార్గం అంతర్ముఖి మార్గం! నిరంతరంఅంతర్గత జాగృతిలో ఉండాలి మరియు అవతలి వ్యక్తి యొక్క అహం గాయపడి ఉంటే, వెంటనే దాని కోసం ప్రతిక్రమణ్ చేయడమే మన పని. మీరు ఇప్పటికే చాలా ప్రతిక్రమణ్ చేస్తున్నారు, వాటిలో ఇది ఇంకొకటి! నేను కూడా ఎప్పుడైనా ఎవరి అహాన్నైనా దెబ్బతీస్తే, అప్పుడు నేను కూడా ప్రతిక్రమణ్ చేస్తాను.

అందువల్ల, ఉదయాన్నే ఇలా చెప్పండి, 'నా మనసు-వాణి-శరీరం ద్వారా ఏ జీవికి అయినా కొంచం కూడా బాధ కలగకూడదు.' ఇలా ఐదు సార్లు చెప్పి బయలుదేరండి, ఆపై ఏదైనా బాధ కలిగితే, అది మీ కోరికకు వ్యతిరేకంగా జరిగింది. దాని కోసం ప్రతిక్రమణ్, సాయంత్రం చేయండి.

ప్రతిక్రమణ్ అంటే ఏమిటి? మరక పడితే వెంటనే కడిగి వేయడం, ఆ తర్వాత ఎలాంటి ఇబ్బంది లేదు. ఆ తర్వాత ఏమైనా సమస్య ఉందా? అపస్మారక స్థితిలో ఉన్న మనుష్యులు ప్రతిక్రమణ్ చేయరు. లేకపోతే, నేను ఎవరికి అయితే జ్ఞానాన్ని ఇచ్చానో, ఆ వ్యక్తులు ఎలా అయ్యారు? విచక్షణగల పురుషులుగా మారారు. వారు క్షణ-క్షణం ఆలోచిస్తారు. ఇరవై రెండు తీర్థంకరుల అనుచరులకు విచక్షణ ఉండేది, వారు 'షూట్ ఆన్ సైట్' ప్రతిక్రమణ్ చేసేవారు. దోషం జరిగిన వెంటనే 'షూట్'! నేటి ప్రజలు అలా చేయలేరు. కాబట్టి భగ్వాన్తుడు ఈ రాయిషి, దేవషి, పాక్షిక, మరియుసంవత్సర ప్రతిక్రమణ్ (ఉదయం, సాయంత్రం, ప్రతి పక్షం రోజులకు మరియు సంవత్సరానికి ఒకసారి ప్రతిక్రమణ్) చేయమన్నారు.

## స్యాద్వాదమైన వాణి, వర్తన, చింతన...

**ప్రశ్నకర్త:** ఇప్పుడు 'ఎవ్వరి అహాన్ని కొంచం కూడా బాధించకుండా ఉండే స్యాద్వాదమైన వాణి, స్యాద్వాదమైన వర్తన మరియు స్యాద్వాదమైన చింతన చేసే పరమ శక్తిని ఇవ్వండి'. ఈ మూడు దయచేసి వివరించండి.

**దాదాశ్రీ:** 'స్యాద్వాద్' అంటే అందరు ఏ భావముతో (ఉద్దేశం), ఏ 'వ్యూ పాయింట్' (దృష్టికోణం) తో మాట్లాడుతున్నారో తెలుసుకోవడం.

**ప్రశ్నకర్త:** అవతలి వ్యక్తి దృష్టికోణం అర్థం చేసుకోవడాన్ని స్యాద్వాద్ అంటారా?

**దాదాశ్రీ:** అవతలి వ్యక్తి దృష్టికోణాన్ని అర్థం చేసుకొని, మరియు తదనుగుణంగా అతనితో వ్యవహరించడాన్ని స్యాద్వాద్ అంటారు. వారి 'వ్యూ పాయింట్' కు బాధ కలగకుండా వ్యవహారము చేయుట. ఒక దొంగ యొక్క దృష్టికోణం బాధించబడకుండా మాట్లాడినప్పుడు, దానిని స్యాద్వాద్ అంటారు!

నేను ఇక్కడ మాట్లాడేది, అవతలి వ్యక్తి ముస్లిం అయినా లేదా పార్సీ అయినా, అందరికి సమానంగా అర్థం అవుతుంది. ఎవరి మాన్యతను కూడా బాధించదు, 'పార్సీలు ఇలాంటి వారు లేదా స్థానిక వాసులు ఇలాంటి వారు' అని ఎవరికీ బాధ కలిగించ కూడదు.

**ప్రశ్నకర్త:** మన మధ్య ఒక దొంగ కూర్చుని ఉంటే, మరియు 'దొంగతనం మంచిది కాదు' అని మనం అంటే, అప్పుడు అతని మనస్సు గాయపడుతుంది కదా?

**దాదాశ్రీ:** లేదు. అలా మాట్లాడకూడదు. మీరు ఆ వ్యక్తికి ఇలా చెప్పాలి, 'దొంగతనం యొక్క పరిణామం ఇలా వస్తుంది. ఇది సముచితమని మీకు అనిపిస్తే, చేయండి.' ఇలా చెప్పొచ్చు. అంటే విషయాన్ని పద్ధతి ప్రకారం తెలియజేయాలి. అప్పుడు అవతలి వ్యక్తి కూడా వినడానికి సిద్ధంగా ఉంటాడు. లేకపోతే, ముందు అతను మీ మాటే వినడు, మరియు దీనికి విరుద్ధంగా, మీ పదాలు వృధా అవుతాయి. మీరు మాట్లాడిన మాటలు ఫలించవు మరియు బదులుగా, అతను ప్రతీకారం తీర్చుకుంటాడు 'ఇతను ఎవరు నాకు చెప్పడానికి', అని అనుకుంటాడు! ఇలా ఉండకూడదు.

దొంగతనం చేయడం అపరాధం అని ప్రజలు అంటారు. కానీ దొంగకు ఏమి తెలుసంటే, 'దొంగతనం చేయడం నా ధర్మం'. నా దగ్గరకు ఎవరైనా ఒక దొంగను తీసుకు వస్తే నేను అతని భుజం చుట్టూ చేయి వేసి ఏకాంతంగా అడుగుతాను, 'సోదరా, నీకు ఈ వ్యాపారం ఇష్టమా? మీరు దీన్ని ఆనందిస్తారా?' అప్పుడు అతను నాకు తన గురించి పూర్తి నిజం చెప్తాడు. నా దగ్గర అతనికి భయం కలగదు. మనుషులు భయం వలన అబద్ధాలు చెబుతారు. అప్పుడు నేను అతనికి వివరిస్తాను, 'నువ్వు చేసే దానికి బాధ్యత ఏమిటో, వీటి పరిణామాల గురించి నీకు తెలుసా?' మరియు 'నువ్వు దొంగిలిస్తున్నావు,' అనేది నా మనసులో కూడా ఉండదు. అది నా మనసులో ఎప్పుడైనా ఉంటే, అప్పుడు అది అతనిపై ప్రభావం చూపుతుంది. ప్రతి వ్యక్తి అతని ధర్మంలో ఉంటాడు. ఎవ్వరి ధర్మము యొక్క మాన్యతను దెబ్బతీయకుండా ఉండే వాణిని స్యాద్వాద్ వాక్కుగా పరిగణించబడుతుంది. స్యాద్వాద్ వాణి సంపూర్ణంగా ఉంటుంది. ప్రతి వ్యక్తి యొక్క ప్రకృతి భిన్నమైనది, అయినా సరే స్యాద్వాద్ వాణి ఎవ్వరి ప్రకృతికీ అభ్యంతరం కలిగించదు.

**ప్రశ్నకర్త:** స్యాద్వాద్ చింతన అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** స్యాద్వాద్ చింతన అంటే ఆలోచనలు, ఆలోచనలో కూడా, ఏ మతము యొక్క మాన్యతను గాయపరచకూడదు. ఇది ప్రవర్తనలో ఖచ్చితంగా ఉండకూడదు, అంతే కాకుండా అది ఆలోచనల్లో కూడా ఉండకూడదు. బాహ్యంగా మాట్లాడడం, అది వేరు, మరియు మనస్సులో కూడా మంచి ఆలోచనలు ఉండాలి, అవతలి వ్యక్తి మాన్యతను దెబ్బతీయకుండా ఉండాలి. ఎందుకంటే మనసులో ఉన్న ఆలోచనలు అవతల వ్యక్తిని చేరుకుంటాయి. అందుకే ఈ వ్యక్తుల ముఖాలు అసంతృప్తిగా కనిపిస్తుంటాయి. ఎందుకంటే మీ ఆలోచనలు అక్కడికి చేరుకుని ప్రభావం చూపుతాయి.

**ప్రశ్నకర్త:** ఎవరి పట్ల అయినా చెడు ఆలోచనలు వస్తే ప్రతిక్రమణ్ చేయాలా?

**దాదాశ్రీ:** అవును, లేకపోతే ఎదుటివారి మనసు చెడిపోతుంది. మరియు మీరు ప్రతిక్రమణ్ చేస్తే, అతని మనస్సులో కలత ఉన్నాసరే, అది మళ్ళీ శాంతిస్తుంది. ఎవరి గురించి కూడా ప్రతికూలంగా లేదా ఆ మార్గాల్లో ఏదైనా ఆలోచించకూడదు. ఏమి చేయకూడదు. 'ప్రతి ఒక్కరూ తమను తాము చూసుకోవాలి'. ఎవరిని వారు సంభాళించుకోండి, చాలు వేరే ఏ గందరగోళం లేదు.

## ధర్మము యొక్క మాన్యతను బాధపెట్టకూడదు...

**ప్రశ్నకర్త:** 2. 'హే దాదా భగవాన్! నేను ఏదైనా ధర్మము యొక్క మాన్యతను కొంచం కూడా బాధ పెట్టకుండా, బాధ పెట్టించకుండా లేదా ఎవరినీ బాధించడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.నేను ఏదైనా ధర్మము యొక్క మాన్యతను కొంచం కూడా బాధించకుండా ఉండే స్యాద్వాదమైన వాణి, స్యాద్వాదమైన వర్తన మరియు స్యాద్వాదమైన చింతన చేసే పరమ శక్తిని ఇవ్వండి.'

**దాదాశ్రీ:** ఎవరి మాన్యతను కూడా బాధపెట్టకూడదు. ఎవరైనా సరే తప్పు చేసినట్లు మీకు అనిపించకూడదు. ఈ '1' కూడా ఒక సంఖ్యగా లెక్కించబడదా?

**ప్రశ్నకర్త:** అవును.

**దాదాశ్రీ:** అలాంటప్పుడు '2' ఇది సంఖ్యగా లెక్కిస్తారా?

**ప్రశ్నకర్త:** అవును, లెక్కిస్తారు.

**దాదాశ్రీ:** మరి '100' లో ఉన్నవాళ్లు ఏమంటారు? 'మాది సరైనది, మీది తప్పు.' అలా అనకూడదు. అందరి (మతం) సరైనదే. '1' దాని స్థాయిలో సరైనది, '2' దాని స్థాయిలో సరైనది, ప్రతి ఒక్కరిది వారి స్థాయిలో సరి అయినదే. కాబట్టి, ప్రతి ఒక్కరి స్థాయిని స్వీకరించే వారు, దానినే 'స్యాద్వాద్' అంటారు. ఒక వస్తువు దాని గుణధర్మములో ఉంటుంది, కానీ మనం కొన్ని గుణాలనే స్వీకరించి, మిగిలిన వాటిని స్వీకరించక పోతే, అది తప్పు. 'స్యాద్వాద్' అంటే అందరి మాన్యతలను అంగీకరించడం. 360 డిగ్రీలో ఉంటే, అందరిది సరైనదని తెలుస్తుంది, కానీ ఈ వ్యక్తి తన డిగ్రీ వరకు సరైనవాడు, మరియు అవతలి వ్యక్తి తన డిగ్రీ వరకు సరైనవాడు.

అందువల్ల, ఇస్లాం ధర్మము కూడా తప్పు అని మనం చెప్పలేము. ప్రతిమతం సరైనది, తప్పు కాదు. మనం ఎవరినీ కూడా తప్పు అని చెప్పలేము! అది అతని మతం. మాంసాహారం తినే వ్యక్తి తప్పు చేస్తున్నాడని ఎలా చెప్పగలం?! అతను ఇలా అంటాడు, 'మాంసం తినడం నా ధర్మం'. కాబట్టి, మేము దానిని తిరస్కరించలేము. అది అతని మానవతా, వారి నమ్మకం. మనం ఎవరి నమ్మకాన్ని కాదు అనలేము. అయినా కానీ మన వాళ్ళు మాంసాహారం తింటూ ఉంటే మనం వారితో చెప్పాలి, 'సోదరా, ఇది మంచిది కాదు.' ఆ తర్వాత కూడా అతను తింటూ ఉంటే, దానిని వ్యతిరేకించలేము. ఇది 'హెల్ప్ ఫుల్' కాదని అతనికి వివరించాలి.

స్యాద్వాద్ అంటే ఏ ధర్మము యొక్క మాన్యతను కొంచం కూడా బాధపెట్టకూడదు. ఎంత ప్రమాణములో సత్యం ఉంటుందో, అంత ప్రమాణంలో వారికి చెబుతాము, మరియు ఎంత ప్రమాణములో అసత్యం ఉంటుందో వారికి అసత్యం అని కూడా చెబుతాము. దీని పేరే ప్రమాణము భాగించక పోవడం. క్రైస్తవులు, ముస్లింలు, ఏ ధర్మము యొక్క మాన్యతను భంగపరచ కూడదు. ఎందుకంటే అందరూ 360 డిగ్రీలోకే వచ్చేస్తాయి. 'రియల్ ఐస్ ది సెంటర్ అండ్ ఆల్ దీజ్ ఆర్ రెలెటివ్ వ్యూస్.' సెంటర్ లో ఉన్న వారికి రెలెటివ్ వ్యూస్ అన్నీ

ఒకటే. భగవన్తుని 'స్యాద్వాద్' అంటే ఎవరికీ కొంచం కూడా బాధ కలగ కూడదు, అది ఏ ధర్మం అయినా సరే!

కావున స్యాద్వాద్ మార్గము ఇలా ఉంటుంది. ప్రతి ఒక్కరి మతాన్ని స్వీకరించాలి. ఎదుటి వ్యక్తి రెండుసార్లు చెంపదెబ్బ కొట్టినా, అది కూడా స్వీకరించాలిబీ ఎందుకంటే ప్రపంచం మొత్తం దోషరహితమైనది. మీరు మీ స్వంత తప్పుల కారణంగా ఇతరులను తప్పుగా చూస్తారు. అంతేకాని లోకంలో ఏ తప్పులేదు. మరియు మీ బుద్ధి ఇతర వ్యక్తుల దోషాలు చూపిస్తుంది, 'ఈ వ్యక్తి తప్పు చేసాడు' అని.

## అవరణవాదం, అపరాధం, అవినయం...

**ప్రశ్నకర్త:** '3. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి ఉపదేశకులు, సాధు, సాధ్వి లేదా ఆచార్యులను అవర్ణవాదం, అపరాధం, అవినయం చేయకుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.' ఇందులో అవర్ణవాదం శబ్దం ఉంది కదా, దాని 'ఎక్జ్యాక్ట్' అర్థం ఏమిటి?

**దాదాశ్రీ:** దేనినైనా ఉన్నది ఉన్నట్లుగా చిత్రించ కుండా, దాని విరుద్ధంగా చిత్రీకరించడం, అదే అవర్ణవాదం! ఇది ఉన్నట్లుగా కాకుండా, దానికి వ్యతిరేకం. దేనినైనా ఉన్నట్లుగా చిత్రీకరించడం మరియు చెడును చెడుగా సూచించడం, మరియు మంచిని మంచిగా సూచించడాన్ని అవర్ణవాదంగా పరిగణించబడదు. కానీ ప్రతిదీ చెడు అన్నప్పుడు, దానిని అవర్ణవాదం అంటారు. ప్రతి వ్యక్తిలో కనీసం కొంచం మంచి ఉంటుందా లేదా? మరియు కొంచం చెడు కూడా ఉండవచ్చు. కానీ వారిది అంతా చెడు అన్నప్పుడు, అది అవర్ణవాదంగా పరిగణించబడుతుంది. 'ఈ విషయంలో అతనికి కొంచెం లోటు ఉంది, కానీ ఈ విషయంలో అతను చాలా మంచివాడు', ఇలా చెప్పాలి.

అవర్ణవాదం అంటే మీకు ఒక వ్యక్తి గురించి తెలుసు, అతని గురించి కొన్ని విషయాలు తెలుసు, అయినప్పటికీ వారి విరుద్ధంగా అతనికి లేని లక్షణాల గురించి మాట్లాడతారు. ఇలా లేని గుణాల గురించి మీరు మాట్లాడితే, అదంతా అవర్ణవాదమే. వర్ణవాదం అంటే ఉన్నది

ఉన్నట్లుగా చెప్పడం మరియు అవర్ణవాదం అంటే లేనిది ఉన్నట్లుగా చెప్పడం. అది భారీ స్థాయిలో విరాధనగా పరిగణించబడుతుంది, చాల పెద్ద విరాధన. ఇది ఇతరులకు, సాధారణ ప్రజలకు చేసినప్పుడు, అది నిందగా పరిగణించబడుతుంది, కానీ అది ఉన్నతమైన వ్యక్తుల కోసం చేసినప్పుడు, అది అవర్ణవాదంగా పరిగణించబడుతుంది. ఉన్నతమైన వ్యక్తులు అంటే ఆధ్యాత్మికంగా అంతర్ముఖి అయిన వారు. ఉన్నతమైన వ్యక్తులు అంటే వ్యవహారంలో ఉన్నత పదవులలో ఉన్నవారు కాదు, ఇది అధ్యక్షులను సూచించదు, ఇది అంతర్ముఖి పురుషులను సూచిస్తుందిబీ దానిని అవర్ణవాదం అంటారు. ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతున్న వారి కోసం ఇది చేసినప్పుడు, అది తీవ్రమైన ప్రమాదం! అవర్ణవాదం ఒక తీవ్రమైన ప్రమాదం! ఇది విరాధన కంటే ఎక్కువ ప్రమాదం.

**ప్రశ్నకర్త:** ఇందులో ఉపదేశకులు, సాధు, ఆచార్యుల గురించి, కాదా?

**దాదాశ్రీ:** అవును, వీరందరూ. వారు సరైన మార్గంలో ఉన్నా లేకపోయినా, జ్ఞానం ఉన్నా లేకపోయినా, అది మనకి చూసే అవసరం లేదు, వారు మహావీర్ భగవన్తుని వెనకాల పడ్డారు కదా? మహావీరుని పేరు మీద చేస్తున్నారు కదా? ఏది చేసినా సరే, మంచి అయినా, చెడు అయినా, కానీ వారు మహావీర్ పేరు మీద చేస్తున్నారు కదా? అందువల్ల, వారి గురించి తప్పుగా (అవర్ణవాద్) మాట్లాడ కూడదు.

**ప్రశ్నకర్త:** అవర్ణవాదం మరియు విరాధన మధ్య తేడా ఏమిటి?

**దాదాశ్రీ:** విరాధన చేసే వారు తప్పు దిశలో వెళ్తాడు, అవరోహణ, తక్కువ జీవన రూపానికి (గతి) వెళ్తాడు. కాగా అవర్ణవాదంతో, తర్వాత ప్రతిక్రమణ్ చేస్తే,అప్పుడు సమస్య లేదు, అది రెగ్యులర్ అవుతుంది. మీరు ఒకరి గురించి తప్పుగా మాట్లాడితే, కానీ మీరు తర్వాత దాని కోసం ప్రతిక్రమణ్ చేస్తే, అది క్లియర్ అవుతుంది.

**ప్రశ్నకర్త:** దయచేసి అవినయం మరియు విరాధన గురించి కొంచెం వివరించండి.

**దాదాశ్రీ:** అవినయంను విరాధనగా పరిగణించరు. అవినయం ఒక అడుగు

తక్కువగా ఉంటుంది, అయితే విరాధనలో వ్యక్తి ఉద్దేశపూర్వకంగామరొకరిని వ్యతిరేకిస్తాడు. అవినయం అంటే, 'నాకు ఏమి పట్టదు' అన్నట్లు ఉండడం. వినయం లేదు, దాని పేరు అవినయం.

**ప్రశ్నకర్త:** అపరాధం అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** ఒక వ్యక్తి ఆరాధన చేస్తే, అప్పుడు అతను ఉన్నతంగా ఎదుగుతాడు, మరియు అతను విరాధన చేస్తే, అప్పుడు అతను కిందకు దిగుతాడు. కానీ అపరాధం చేసేవాడు రెండు వైపుల నుండి కొట్టబడతాడు. అపరాధం చేసే వ్యక్తి, తాను అభివృద్ధి చెందడు, మరియు ఎవ్వరిని అభివృద్ధి చెందనివ్వడు. అలాంటి వ్యక్తిని అపరాధి అని అంటారు.

**ప్రశ్నకర్త:** విరాధనలో కూడా ఎవ్వరిని అభివృద్ధి చెందనివ్వడు కదా?

**దాదాశ్రీ:** కానీ తులనాత్మకంగా, విరాధన మంచిది. ఎవరికైనా సరైన దిశ తెలిస్తే చెబుతారు కదా, 'ఏమి చూసి నువ్వు ఇలా నడుస్తున్నావు? ఇటు వైపు అహ్మదాబాదు ఉంటుందా?!' అప్పుడు అతను వెనుకకు తిరగవచ్చు కూడా. కానీ అపరాధి వెనుకకు తిరగడు మరియు ముందుకు కూడా సాగడు. విరాధన చేసేవాడు తప్పు దిశలో నడుస్తాడు, కానీ అతను పడిపోతాడు కదా!

**ప్రశ్నకర్త:** కానీ విరాధన చేసే వారికి వెనుకకు తిరిగే అవకాశం ఉందా?

**దాదాశ్రీ:** అవును, వెనుకకు తిరిగే అవకాశం తప్పకుండా ఉంది!

**ప్రశ్నకర్త:** అపరాధికి వెనక్కి తిరిగే అవకాశం ఉందా?

**దాదాశ్రీ:** అతను వెనుకకు తిరగడు, మరియు ముందుకు కూడా సాగడు. అతనికి ఏ తరగతి (క్లాసు) మొగ్గ లేదు. అతను ముందుకు కదలడు, లేదా వెనుకకు కదలడు. ఎప్పుడు చూసినా అతను, సరిగ్గా ఉన్న చోటనే ఉంటాడు, దీనినే అపరాధం అని సూచిస్తారు.

**ప్రశ్నకర్త:** అపరాధం యొక్క నిర్వచనం ఏమిటి?

**దాదాశ్రీ:** విరాధన కోరిక లేకుండానే జరుగుతుంది, మరియు అపరాధం కోరికతో జరుగుతుంది.

**ప్రశ్నకర్త:** అది ఎలా జరుగుతుంది దాదాశ్రీ?

**దాదాశ్రీ:** ఒక వ్యక్తి మొండిగా మారితే, అతను అపరాధం చేస్తాడు. ఇక్కడ విరాధన చేయకూడదని తెలిసినా, విరాధన చేస్తాడు. తెలిసి చేసేవిరాధన, అపరాధం కిందకు వస్తుంది. విరాధన చేసేవాడు విడుదల కావచ్చు, కానీ అపరాధం చేసేది విడుదల అవ్వలేదు. చాలా విపరీతమైన, బలమైన అహం ఉన్న వ్యక్తి అపరాధం చేస్తాడు. అందుకే మీకు మీరే చెప్పాలి, 'నువ్వు మూరు?డివి. కారణం లేకుండా పవర్ తో ఆడంబరంగా తిరుగుతున్నావు. ఇది ప్రజలకు తెలియకపోవచ్చు, కానీ నువ్వు ఎలాంటి వాడివో నాకు తెలుసు. నీకు పిచ్చి.' మీరు ఏదో ఒక రకమైన పరిష్కారం తీసుకురావాలి. ప్లస్ మరియు మైనస్ చేయాలిబీ గుణకారం మాత్రమే చేస్తే, అది ఎక్కడికి దారి తీస్తుంది? అందువల్ల, మీరు కొంత విభజన చేయాలి. కూడిక మరియు తీసివేత ప్రకృతికి ఆధీనమై ఉంది, కానీ గుణకారం మరియు విభజన మనుషుల చేతిలో ఉంది. ఈ అహం వలన ఏడుతో గుణిస్తే, దానిని ఏడుతో భాగించండి, కాబట్టి మిగిలినది ఏమి ఉండదు!

**ప్రశ్నకర్త:** మనం ఒకరిని నిందించినప్పుడు, అది దేని క్రిందకు వస్తుంది?

**దాదాశ్రీ:** నింద, ఇది విరాధన కిందకు వస్తుంది, కానీ అది ప్రతిక్రమణ్ తో తుడిచివేయబడుతుంది. ఇది అవర్ణవాదం లాంటిది. అందుకే 'ఎవరి నింద చేయవద్దు' అంటాను. అయినా సరే, ప్రజలు ఇతరుల వెనుక మాట్లాడతారు. హే, ఎవరి నింద చేయకూడదు. ఈ వాతావరణం పూర్తిగా పరమాణులతో నిండి ఉంది. ప్రతిదీ వ్యక్తికి చేరుతాయి. ఒక్క బాధ్యతా రహితమైన మాట కూడా ఎవరి గురించి అనకూడదు. మరియు మీరు ఏదైనా చెప్పవలసి వస్తే, మంచిగా చెప్పండి, గౌరవప్రదంగా చెప్పండి, అవమానకరమైనది చెప్పవద్దు.

కాబట్టి, ఎవరి దూషణలలో పాలుపంచుకోకండి. కీర్తన చేయ లేకపోతే ఇబ్బంది లేదు కానీ నిందలో పాలుపంచుకోవద్దు. నేను ఏమి తెలియజేస్తున్నాను అంటే, 'నిందించడంలో

మనకు ఏం లాభం?' అందులో విపరీతమైన నష్టం ఉంది. ఈ ప్రపంచంలో విపరీతమైన నష్టం అంటూ ఏదైనా ఉంటే, అది నిందించడంలో ఉంటుంది. అందువలన, ఎవరినీ నిందించడానికి కారణం ఉండకూడదు.

ఇక్కడ అస్సలు నింద అనే వస్తువు ఏమి ఉండదు. మేము అర్థం చేసుకోవడానికి మాత్రమే చర్చిస్తాము, ఏది సరైనదో ఏది తప్పో! ప్రభువు ఏమి చెప్పాడు? 'తప్పును తప్పుగా తెలుసుకో మరియు సరైన దానిని సరైనదని తెలుసుకో. అయితే, తప్పు అని తెలుసుకొనేటప్పుడు దాని పట్ల కొంచెం కూడా ద్వేషం ఉండకూడదు, మరియు మంచిని తెలుసుకొనేటప్పుడు దాని పట్ల కొంచెం కూడా రాగం ఉండకూడదు'. తప్పును తప్పు అని తెలుసుకోకపోతే మంచిని మంచి అని తెలుసుకోలేము. అందువలన, మేముదానిని వివరంగా చర్చించాలి. జ్ఞాని నుండి మాత్రమే జ్ఞానాన్ని అర్థంచేసుకోవచ్చు.

## అభావము, తిరస్కారము చేయకూడదు...

**ప్రశ్నకర్త:** 4. 'హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ వైపు కొంచం కూడా అభావము, తిరస్కారము ఎప్పుడూ చేయకుండా, చేపించకుండా, ఎవరినీ చేయడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.'

**దాదాశ్రీ:** అవును అది కరెక్ట్. మనకు ఎవరి పట్ల అయినా అభావము కలిగితే, ఉదాహరణకు మీరు మీ కార్యాలయంలో కూర్చున్నారు మరియు ఎవరైనా లోపలికి వస్తే, మీరు అయిష్టంగా భావించవచ్చు (అభావము) లేదా ఆ వ్యక్తి పట్ల ధిక్కారం కలగవచ్చు. కాబట్టి మీరు దాని గురించి ఆలోచించాలి మరియు పశ్చాత్తాపం చెందాలి, ఇలా జరగకూడదు, అని.

ధిక్కారం ఉన్నంత వరకు ఒకడు స్వేచ్ఛగా ఉండలేడు. దీని ద్వారా చాలా ప్రతీకారం కట్టుబడతారు. ఎవరితోనైనా ధిక్కారం కలిగి ఉంటే, అది నిర్జీవ వస్తువుల పట్ల అయినా సరే, వారి నుండి విడుదల పొందలేరు. అందువలన, ఎవ్వరి పట్లా కొంచం ధిక్కారం కూడా చెల్లదు. మరియు ఎవరి మీద అయినా ధిక్కారం ఉన్నంత కాలం వితారాగ్ (అటాచ్మెంట్

మరియు అసహ్యం లేనివారు) కాలేరు. నిజానికి, మీరు వితారాగ్‌గా మారాలి, అప్పుడే ముక్తిని పొందగలరు!

## కఠోర-తంతీలమైన భాష మాట్లాడకుండా...

**ప్రశ్నకర్త:** 5. 'హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మతో ఎప్పుడూ కఠోర భాష, తంతీలమైన భాష మాట్లాడకుండా, ఎవరినీ మాట్లాడేలా చేయకుండా, లేదా మాట్లాడడానికి అనుమోదించ కుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి. ఎవరైనా కఠోర భాష, తంతీలమైన భాష మాట్లాడితే, నాకు మృదు-రుజు భాష మాట్లాడడానికి పరమ శక్తిని ఇవ్వండి.'

**దాదాశ్రీ:** కఠోర భాష మాట్లాడకూడదు. ఎవరితోనైనా కఠోర భాష మాట్లాడి ఉంటే, మరియు అతను బాధపడి ఉంటే, మీరు అతనికి వ్యక్తిగతంగా క్షమాపణ చెప్పాలి, 'మిత్రమా, నేను తప్పు చేసాను, దయచేసి నన్ను క్షమించు.' మరియు అతనికి వ్యక్తిగతంగాచెప్పలేకపోతే, లోపల్నుంచి పశ్చాత్తాపపడండి, 'నేను ఇలా మాట్లాడకూడదు' అని.

**ప్రశ్నకర్త:** మరియు పదే పదే గుర్తు చేసుకోవాలి, ఇలా మాట్లాడకూడదు అని.

**దాదాశ్రీ:** అవును, మీరు దీని గురించి ఆలోచించి పశ్చాత్తాపపడాలి. పశ్చాత్తాపం చేస్తేనే అది ఆగిపోతుంది. లేకుంటే, అది స్వయంచాలకంగా ఆగదు. ఇది ఊరికే (నన్ను క్షమించండి) అని చెప్పడంతో ఆగదు.

**ప్రశ్నకర్త:** మృదు-రుజు భాష అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** రుజు అంటే సరళమైనది, మరియు మృదు అంటే నమ్రతతో కూడినది. అత్యంత నమ్రతతో ఉంటే అది మృదుగా పరిగణించబడుతుంది. కాబట్టి సరళమైన మరియు వినయంతో కూడిన భాష మాట్లాడడానికి శక్తిని అడగండి. అలా చేస్తూ ఉంటే, ఆ శక్తి వస్తుంది. మీరు కఠోర భాష మాట్లాడినట్లయితే మరియు మీ కొడుకు బాధ పడితే, అప్పుడు మీరు దాని గురించి పశ్చాత్తాపపడాలి. మరియు మీరు మీ కొడుకుతో కూడా చెప్పండి, 'నన్ను

క్షమించు. ఇంకెప్పుడు ఇలా మాట్లాడను.' ఇదే వాణిని మెరుగుపరచడానికి మార్గం మరియు 'ఇది' ఒక్కటే కళాశాల.

**ప్రశ్నకర్త:** మరి కఠోర భాష-తంతీలమైన భాష మరియు మృదు-రుజు భాషమధ్య తేడా ఏమిటి?

**దాదాశ్రీ:** చాలా మంది కఠోర భాష వాడతారు కదా, 'నువ్వు చెడ్డవాడివి, నువ్వు ఒక మోసగాడివి, నువ్వు ఒక దొంగవి' అని. మనం ఇంతకు ముందెన్నడూ వినని పదాలు వాడుతారు! కఠోర మాటలు వినగానే, మన హృదయం కూడా ఆగిపోవచ్చు. ఈ కఠోర భాష ఎప్పుడూ ఆహ్లాదకరంగా పరిగణించబడదు. బదులుగా, మనసులో అనిపిస్తుంది, 'ఇది ఎక్కడి నుంచి వస్తోంది!!' కఠోర భాష అహంకారపూరితంగా ఉంటుంది.

మరియు తంతీలమైన భాష అంటే ఏమిటి? ఒకరితో పోటీ పడుతున్నప్పుడు వివాదాలు ఉంటాయి, కాదా? 'చూడు నేను ఎంత బాగా వంట చేశానో. మరియు ఆమెకు ఎలా వండాలో కూడా తెలియదు.' ఈ విధంగా, వివాదంలో పాల్గొంటారు, పోటీ చేయడం ప్రారంభిస్తారు. ఈ తంతీలమైన (బాధకరమైన) భాష చాలా చెడ్డది.

కఠోర మరియు తంతీలమైన భాష మాట్లాడకూడదు. భాష ద్వారా జరిగే తప్పులు అన్నీ ఈ రెండు పదాలలో వచ్చేస్తాయి.కాబట్టి మీకు ఖాళీ సమయం దొరికినప్పుడు, మీరు 'దాదా భగవాన్' ను శక్తులు అడుగుతూ ఉండాలి. మీరు చేదుగా మాట్లాడితే, అప్పుడు దాని కౌంటర్ శక్తి కోసం అడగండి, 'నాకు శుద్ధ వాణి మాట్లాడడానికి శక్తిని ఇవ్వండి. నాకు స్యాద్వాదమైన వాణి మాట్లాడడానికి శక్తిని ఇవ్వండి, మృదు-రుజు భాష మాట్లాడడానికి శక్తిని ఇవ్వండి. ఇలా అడుగుతూ ఉండండి. స్యాద్వాద్ వాణి అంటే ఎవరినీ నొప్పించని వాణి.

## నిర్వికారంగా ఉండడానికి శక్తిని ఇవ్వండి...

**ప్రశ్నకర్త:** 6. 'హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ వైపు, స్త్రీ, పురుషుడు లేదా నపుంసకుడు, ఏ లింగధారి అయినా సరే, వారికి సంబంధించి కొంచం కూడా విషయ-వికారానికి సంభందించిన దోషాలు, కోరికలు, చేష్టలు లేదా, ఆలోచనలకు

సంబంధించిన దోషాలు చేయకుండా, చేయించకుండా,లేదా ఎవరైనా చేయడానికి అనుమోదించ కుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి. నాకు నిరంతరం నిర్వికారంగా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.'

**దాదాశ్రీ:** మీరు ఎవరినైనా లైంగిక ఉద్దేశంతో వీక్షిస్తే, వెంటనే 'చందూభాయ్'కి (పాఠకులు వారి పేరును ఇక్కడ చొప్పించండి) చెప్పండి, 'ఇది సరైనది కాదు. ఇది మీకు శోభించదు. మీరు ఉదాత్త గుణాలు కలిగిన వ్యక్తి. మీకు ఒక సోదరి ఉన్నట్లే, ఆమె కూడా ఒకరి సోదరి! ఎవరైనా మీ సోదరిని లైంగిక ఉద్దేశ్యంతో చూస్తుంటే, అప్పుడు మీరు ఎలా బాధపడతారు! అదేవిధంగా, వేరే వారికి బాధ కలుగుతుందా లేదా? కాబట్టి, ఇది మీకు శోభించదు.' కాబట్టి, మీరు ఎవరినైనా లైంగిక (విషయ-వికారానికి సంభందించిన)ఉద్దేశ్యంతో చూసినట్లయితే, అప్పుడు దాని గురించి పశ్చాత్తాపపడండి.

**ప్రశ్నకర్త:** చేష్టలు అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** శరీరం యొక్క చర్యలు ఏవైతే ఫోటో తీయగలమో, వాటన్నిటిని చేష్టలుగా పరిగణిస్తారు. మీరు ఎవరినైనా ఎగతాళి చేస్తే, అది చేష్టగా పరిగణించబడుతుంది. ఇలా నవ్వుతూ ఉంటే, ఇది కూడా చేష్ట.

**ప్రశ్నకర్త:** కాబట్టి మనం ఎవరినైనా ఎగతాళి చేయడం, ఒకరి మీద చిలిపి చేష్టలు చేయడం, అవి చేష్టలా?

**దాదాశ్రీ:** అనేక రకాల చేష్టలు ఉన్నాయి.

**ప్రశ్నకర్త:** మరి ఈ విషయ వికారముకు సంబంధించిన చేష్టలు ఏమిటి?

**దాదాశ్రీ:** విషయ-వికారానికి సంభందించి శరీరం ఏవైతే కార్యాలు చేస్తాయో, వాటి ఫోటో తీయవచ్చు, కాబట్టి అవన్నీ చేష్టలు. శరీరం ద్వారా చేయలేనివి చేష్టలు కావు. కొన్నిసార్లు ఆ కోరికలు మరియు ఆలోచనలు తలెత్తుతాయి, కానీ అవి చర్యలోకి రావు. ఆలోచనలకు సంబంధించిన దోషాలు మనసువి!

'నాకు నిరంతరం నిర్వికారంగా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.' మీరు 'దాదాశ్రీ' నుండి ఇది అడగాలి. దాదాశ్రీ దానేశ్వరుడు.

## ఆహారంలో లుబ్ధము కాకుండా...

**ప్రశ్నకర్త:** 7. 'హే దాదా భగవాన్! నాకు ఏ ప్రకారమైన అభిరుచులలోను లుబ్ధము కాకుండా ఉండడానికి శక్తిని ఇవ్వండి. సంరసిఆహారంతీసుకునే పరమ శక్తిని ఇవ్వండి.'

**దాదాశ్రీ:** మీరు తినడానికి కూర్చున్నప్పుడు కొన్ని కూరగాయల వంటకాలే ఇష్టపడతారు, ఉదాహరణకి టమోటాలతో చేసినవి మాత్రమే. మీరు వాటిని తర్వాత గుర్తుంచుకుంటూ ఉంటె, మీరు లుబ్ధము అయిపోయారని పరిగణించబడుతుంది. టమోటాలు తినడం తప్పు కాదు, కానీ అవి జ్ఞాపకం వస్తూనే ఉండకూడదు. లేకపోతే మీ శక్తియుక్తులు అన్నీ లుబ్ధమవ్వడంలోనే వెళ్లిపోతాయి. కాబట్టి, మీరు ఇలా చెప్పాలి, 'ఏది వడ్డించినా సరే నాకు సరిపోతుంది.' ఏ రకమైన లుబ్ధతఉండకూడదు. మీ ప్లేట్‌లో ఏది వడ్డించబడిందో, దానిని ప్రశాంతంగా తినండి. ఎలాంటి అభ్యంతరం ఉండకూడదు. కానీ, మీ ప్లేట్‌లో ఏమి వడ్డించినా వాటిని అంగీకరించండి, ఏదైనా ఇతర ఆహారాన్ని గుర్తు తెచ్చుకోకండి.

**ప్రశ్నకర్త:** మరియు ఈ సంరసి అంటే ఏమిటి?

**దాదాశ్రీ:** సంరసి అంటే అరిసెలు, సూప్, అన్నం, కూరలు, అన్నీ తినాలి, కానీ కేవలం అరిసెలు మాత్రమే తింటూ ఉండకూడదు.

మరియు కొంతమంది మిఠాయిలు తినడం మానేస్తారు. అయితే మిఠాయిలు వారికి వ్యతిరేకంగా దావా వేస్తాయి. అవి ఏమంటాయంటే, 'నాతో నీకేంటి?' తప్పు ఒకరు చేస్తే, శిక్ష మరొకరికి పడుతుంది! హే, మీరు నాలుకను ఎలా శిక్షించగలరు? తప్పు మరొకరిది. అంటే, అజ్ఞానత యొక్క తప్పు.

**ప్రశ్నకర్త:** కానీ సంరసి ఆహారం అంటే ఏమిటి? అన్ని ఆహారాల పట్ల ఓకే భావన ఎలా ఉంచవచ్చు?

**దాదాశ్రీ:** మీ సంస్కృతిలో ఏ ఆహారాన్ని వండుతారో, అది మీ 'సంస్కృతి' కోసం సంరసిగా పరిగణించబడే దాని ఆధారంగా వండుతారు. మరియు మీరు దానిని మరొకరికి పెడితే, వారికి అది సంరసిగా అనిపించదు. మీ సంస్కృతిలో బహుశా, తక్కువ మసాలా తింటారు. సంరసి ఆహారం ప్రతి సంస్కృతిలో భిన్నంగా ఉంటుంది. సంరసి ఆహారం అంటే అది రుచిగా ఉంటుందిబీ 'టెస్ట్ ఫుల్' ఫుడ్ . దీని అర్థం ఏ ఒక్క పదార్థం ఆధిపత్యం వహించదు, అన్నిపదార్థాలు నిష్పత్తిలో ఉంటాయి. కొంతమంది అంటారు, 'నేను కేవలం పాలు తాగితే సరిపోతుంది.' అప్పుడు అది సంరసి ఆహారంగా పరిగణించబడదు. సంరసి అంటే మొత్తం ఆరు రకాల రుచులు కలిపి మంచిగా తినండి, రుచిగా తినండి. మీరు చేదు రుచిని భరించలేకపోతే, కాకరకాయ, కాక్రోలు లేదా మెంతి ఆకులు తినండి, కానీ మీరు ఖచ్చితంగా చేదుగా ఉన్న ఆహారాన్ని తీసుకోండి. చేదు ఆహారాలు తినకపోతే వ్యాధులు ఉత్పన్నమవుతాయి. అందుకే తరవాత క్వినైన్ (మలేరియాను ఎదుర్కోవడానికి అత్యంత చేదు ఔషధం) తీసుకోవలసి వస్తుంది. చేదు రుచి తక్కువగా తీసుకోవడం వల్ల ఈ సమస్యలు తలెత్తుతున్నాయి! అన్ని రుచులు తీసుకోవాలి.

**ప్రశ్నకర్త:** కాబట్టి అన్ని అభిరుచులను తీసుకోవడం కోసం మనం శక్తిని అడుగుతాము, 'ఓ దాదా భగవాన్!, అన్ని రుచులను సమతుల్యతతో తీసుకోవడానికి నాకు శక్తిని ఇవ్వండి.

**దాదాశ్రీ:** అవును, మీరు శక్తిని అడగాలి. మీ భావన ఏమిటి? సంరసి ఆహారం తీసుకోవాలనే భావన మీ పురుషార్థం. మరియు నేను మీకు శక్తి ఇచ్చినప్పుడు మీ పురుషార్థం మరింత బలపడుతుంది!

**ప్రశ్నకర్త:** ఏ ప్రకారమైన అభిరుచులలోను లుబ్ధము అవ్వకూడదు, అనేది కూడా నిజమేనా?

**దాదాశ్రీ:** అవును, కాబట్టి మీకు ఇలా అనిపించకూడదు 'నాకు పులుపు తప్ప వేరే ఏది ఇష్టం లేదు' అని. 'తీపి లేకుండా నేను తినలేను' అని కొందరు అంటారు. అలాంటప్పుడు కారంలో తప్పు ఏమిటి? కొంతమంది అంటారు, 'నాకు తీపి అస్సలు ఇష్టం ఉండదు. నాకు

కారం మాత్రమే కావాలి.' అవన్నీ సంరసిగా పరిగణించలేము. సంరసి అంటే అన్నీ 'యాక్సెప్టెడ్'. ఏదైనా తక్కువ లేదా ఎక్కువ నిష్పత్తిలో ఉండవచ్చు, కానీ ప్రతిదీ అంగీకరించబడుతుంది.

**ప్రశ్నకర్త:** సంరసి ఆహారం మరియు జ్ఞానం మధ్య ఏదైనా సంబంధం ఉందా? జ్ఞాన జాగృతి కోసం సంరసి ఆహారం లేకుంటే, అది తీసుకోకూడదా?

**దాదాశ్రీ:** సంరసి ఆహారం కోసం ఏంటంటే, మన మహాత్మలకు (ఆత్మజ్ఞానం పొందిన వారు) ఏది జరగని అది  ప్రతిదీ 'వ్యవస్థిత్' (శాస్త్రీయ పరిస్థితులకు సంబంధించిన ఆధారాలు), కాబట్టి రచ్చ చేయవలసిన అవసరం ఏమిటి? ఇదంతా బయట ప్రజల (ఆత్మజ్ఞానం పొందని వారు) కోసం చెప్పబడింది, అయితే మన మహాత్మలు కనీసం ఆలోచిస్తారు కదా, సాధ్యమైనంతవరకు సంరసి ఆహారం తీసుకోవాలి అని. 'నాకు కొన్ని మిరపకాయలు తీసుకురండి' అని నేను అంటాను. మరియు 'నేను దగ్గుకు మందు తీసుకుంటున్నాను!' అని కూడా అంటాను. అప్పుడు 'మేము' (జ్ఞాని పురుషుడు) దగ్గుకు పరిహారం ఇవ్వబడుతుంది అని కూడా 'తెలుసుకుంటాం', ఎందుకంటే ప్రకృతి (విసర్జన) తన పాత్రను పోషిస్తుంది!

## ప్రకృతి యొక్క గుణకారం మరియు విభజన

**ప్రశ్నకర్త:** కనుక ఈ ప్రకృతికి సంరసి కావాలా?

**దాదాశ్రీ:** ప్రకృతి అంటే ఏమిటి? అది పదమూడుతో గుణించి ఉంటె, పదమూడుతో భాగిస్తే, ప్రకృతి అంతమవుతుంది. ఇప్పుడు ఎవరైనా పదిహేడుతో గుణించిన దానిని పదమూడుతో భాగించినప్పుడు ఏమవుతుంది? అంటే, నేను వేరే లెక్క పెట్టాను.

**ప్రశ్నకర్త:** కాబట్టి పదమూడుతో గుణించిన దానిని పదమూడుతో విభజిస్తే...

**దాదాశ్రీ:** అలా చేస్తే, ఇక మిగిలినది ఏమి లేదు కదా!

**ప్రశ్నకర్త:** మనం ఆ ఉదాహరణను ఏ విధంగా అన్వయించవచ్చు?

**దాదాశ్రీ:** ప్రకృతి అంటే, ముందు ఏవైతే భావాలు చేశారో, అవి దేని ఆధారంగా చేశారంటే, ఇతర ఆహారం తన యొక్క ఆధారం. ఏ భావం చేశారు. ఇప్పుడు ఆ భావం

పదమూడుతో గుణించబడింది. ఇప్పుడు మీరు ఆ భావాన్ని వదిలించుకోవాలనుకుంటే, దానిని పదమూడుతో భాగిస్తే, అది వెళ్లిపోతుంది. మరియు కొత్త భావం తలెత్తనివ్వము కాబట్టి, ఆ ఖాతా మూసివేయబడింది. కొత్త కోరికలు లేవు, కాబట్టి ఖాతా ముగుస్తుంది. ఖాతాకు సీలు వేయాలి.

## ...అక్కడే ప్రకృతి శూన్యంఅవుతుంది

**ప్రశ్నకర్త:** మీరు మాకు ఆత్మజ్ఞానాన్ని అందించారు. ఇప్పుడు ఈ తొమ్మిది కలములు చెబితే, అవి ప్రకృతిని శూన్యతకు తీసుకురావడానికి సహాయం చేస్తాయా?

**దాదాశ్రీ:** అది జరుగుతుంది. మీరు ఎంతతో గుణించారో, అంతతో విభజించండి. నాకు డాక్టర్ చెప్పారు, 'ఇది తినండి'. నేను చెప్పాను, 'డాక్టర్, ఈ మాట వేరే రోగికి చెప్పండి'. నా 'గుణకారం' వేరే రకం. అతను నాకు విభజించడానికిఇస్తే ఎలా కుదురుతుంది?

**ప్రశ్నకర్త:** మీరు ఈ కారంపొడి ఎక్కువ వేసుకొని విభజించారా?

**దాదాశ్రీ:** కారంపొడి కలుపుతున్నప్పుడు, నేను అందరికి చెప్తున్నాను నేను ఇది దగ్గుకు మందుగా వాడుతున్నాను అని, మరియు దగ్గు వస్తే, నేను దాన్ని చూపుతాను, 'చూడండి, దగ్గు వచ్చింది కదా?'

**ప్రశ్నకర్త:** ఇందులో విభజన ఎక్కడ వస్తుంది?

**దాదాశ్రీ:** అదే విభజన. నేను కారంపొడి తీసుకోకపోతే, అప్పుడు మరి విభజన పూర్తి అయ్యి ఉండేది కాదు.

**ప్రశ్నకర్త:** కాబట్టి ముందుగా ప్రకృతిలో ఏదైతే నింపబడిందో, ఇప్పుడు అది పూర్తి చెయ్యాలి.

**దాదాశ్రీ:** అవును, క్లియర్ చేయాలి.

నేను నిరూబెన్‌తో చెప్తుంటాను, 'మీరు అంగీకరిస్తే, నేను కొంత తమలపాకు తింటాను.'

అయితే అది నమిలుతూ, 'ఇది దగ్గు కలిగించే ఔషధం', అని అంటాను. అయితే ఆమె చాలా సార్లు 'వద్దు' అంటుంది, అప్పుడు నేను తీసుకోను, మరియు ఆమె తీసుకోమని చెప్పినప్పుడు, నేను తీసుకుంటాను. అప్పుడు నాకు దగ్గు వస్తుంది. మరియు (సాధారణంగా) నేను తమలపాకు తినను. 'నాకు' ఏ అలవాటు లేదు. అయితే, ఇది (తమలపాకు తినడం) గతంలో నిండిన స్టాక్, దాని వలన తినబడుతాను కదా?

ఇది మన అక్రమ విజ్ఞానం! ఇది గత జీవితంలో ఏర్పడిన అలవాట కారణంగా జరుగుతున్నాయి. కాబట్టి ఈ శక్తిని అడగండి. అప్పుడు లుబ్ధ ఆహారం తీసుకోవడం వల్ల ఇబ్బంది ఉండదు, కానీ ఇలా ఈ కలం చెప్పడం ద్వారా, (గతంలో చేసిన) ఒప్పందాలు విడుదల చేయబడతాయి.

**ప్రశ్నకర్త:** ప్రస్తుతం మన దగ్గర ఉన్న ప్రకృతి ఏదైనా సరే, అది గుణించబడితే, అప్పుడు అది పెరుగుతుంది. దానిని విభజించాలి. 'ప్రకృతిని ప్రకృతితో విభజించాలి.' దయచేసి దీన్ని వివరించండి.

**దాదాశ్రీ:** అంటే, మీరు ఈ కలం చెబుతూ ఉంటె, విభజన జరుగుతుంది మరియు అది తగ్గుతుంది. మీరు ఇలాంటి కలం చెప్పకపోతే, అప్పుడు 'మొక్క' తనంతట తానుగా పెరుగుతూనే ఉంటుంది. అందుకే ఇలా చెప్పుకుంటూ పోతే తగ్గుతుంది. మీరు ఇలా చెబుతూ ఉంటె, లోపల గుణకారం చేయబడ్డ ప్రకృతి తటస్థీకరించబడుతుంది. అప్పుడు ఆత్మ యొక్క గుణకారం జరుగుతుంది మరియు ప్రకృతి యొక్క విభజన జరుగుతుంది. కాబట్టి, ఆత్మ పోషించబడుతుంది. మీకు సమయం ఉన్నప్పుడు ఈ తొమ్మిది కలములు రోజు చెప్పండి. మీకు కొంత ఖాళీ సమయం దొరికిన క్షణం, వాటిని చెప్పండి. 'మేము' అన్ని మందులు ఇస్తాం, అవగాహన ఇస్తాం, ఆ తరవాత మీరు చేయాలనుకున్నది చేయండి.

## ప్రత్యక్షంగా-పరోక్షంగా, జీవించి ఉన్నా లేదా చనిపోయినా...

**ప్రశ్నకర్త:** 8. 'హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ, ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా ఉన్నా, జీవించి ఉన్నా లేదా చనిపోయినా, ఎవ్వరినీ కొంచం కూడా అవర్ణవాదం,

అపరాధం, అవినయం చేయకుండా, చేయించ కుండా, లేదా చేయడానికి అనుమోదించకుండా ఉండడానికి ప్రరమ శక్తిని ఇవ్వండి.'

**దాదాశ్రీ:** అవరణవాదం అంటే ఎవరికైనా బయట మంచి పేరు ఉంటె, అతను బాగా గౌరవం గల వాడైతే, కీర్తి ఉంటె, మనం అతని గురించి చెడుగా మాట్లాడి, ఆ కీర్తిని విచ్ఛిన్నం చేయడం, దీనినే విరుద్ధంగా మాట్లాడటం అంటారు.

**ప్రశ్నకర్త:** దానిలో, మనం చనిపోయిన వారి నుండి క్షమాపణ కోరినప్పుడు, మనం ఏదైతే వారిని సంబోధిస్తామో, అది వారికి చేరుతుందా?

**దాదాశ్రీ:** అతనికి చేర్చాల్సిన అవసరం లేదు. ఒక మనిషి చనిపోతే, మీరు ఇప్పుడు అతనిని తిట్టుకుంటూ ఉంటె, మీరు భయంకరమైన దోషములో పడతారు. ఈ కలము ఇదే సూచిస్తుంది. అందుకే మేము మీకు చెబుతున్నాం, మరణించిన వారికి విరుద్ధంగా మాట్లాడ వద్దు అని. ఇక చేర్చడం-చేర్చకపోవడంలో ప్రశ్నే లేదు. ఒక చెడ్డ వ్యక్తి, జీవితాంతం తప్పు చేసి మరణించినా సరే, అతని గురించి తప్పుగా మాట్లాడకూడదు.

ఇప్పుడు రావణుడి గురించి చెడుగా మాట్లాడకూడదు. ఎందుకంటే ఇప్పటికి అతను దేహాన్ని ధరించి ఉన్నాడు (రెండవ జన్మలో). కాబట్టి అతనికి 'ఫోన్' చేరుకుంటుంది. 'రావణ్ ఇలా ఉండేవాడు, అలా ఉండేవాడు' అన్నప్పుడు, అతనికి చేరుకుంటుంది.

మీ చుట్టం ఎవరైనా మరణించి ఉంటె, మరియు అతనిని ప్రజలు నిందిస్తూ ఉంటె, మీరు మధ్యలో అవును అని జోడించకూడదు. మధ్యలో జోడిస్తే తరవాత పశ్చాత్తాప పడండి, ఇలా జరగకూడదు అని. ఎవరైనా మరణించిన వారి గురించి మాట్లాడడం భయంకరమైన తప్పు. మన ప్రజలు చనిపోయిన వారిని కూడా వదలరు. ప్రజలు ఇలా చేస్తారా లేదా? ఇలా చేయకూడదు, మేము ఇదే చెప్పాలనుకుంటున్నాము. దీని వలన చాల పెద్ద బాధ్యత వహించవలసి వస్తుంది.

ఆ సమయంలో గతంలోని అభిప్రాయాల వలన అలా మాట్లాడటం జరుగుతుంది. కాబట్టి ఈ కలం చెప్తూ ఉంటె, మీరు అలా మాట్లాడినా సరే, దోషం కలగదు. హుక్కా తాగుతున్నప్పుడు, మీరు ఇలా చెబుతూ ఉంటే, 'నాకు ధూమపానం చేయకుండా, చేయనివ్వకుండా, చేయడానికి అనుమోదించకుండా ఉండడానికి శక్తిని ఇవ్వండి,' మీరు గతంలోని ఒప్పందాల నుండి విడుదల పొందుతారు. లేకపోతే, పుద్గల్ (నాన్-సెల్ఫ్ కాంప్లెక్స్) యొక్క స్వభావం మిమ్మల్ని వెంటనే వెనక్కి తగ్గుతుంది. కాబట్టి ఈ భావన భావించండి.

## జగత్తు యొక్క కళ్యాణం చేసే శక్తిని ఇవ్వండి !

**ప్రశ్నకర్త:** 9.' హే దాదా భగవాన్! నాకు జగత్కల్యాణం చేయడానికి నిమిత్తం అవ్వడానికి  పరమ శక్తిని ఇవ్వండి, శక్తిని ఇవ్వండి, శక్తిని ఇవ్వండి.' మేము ఈ కళ్యాణం కోసం భావన చేస్తే, ఏ విధంగా పని చేస్తుంది?

**దాదాశ్రీ:** మీ మాటలు ఎలా వస్తాయి అంటే, మరొకరి పని పూర్తి అవుతుంది.

**ప్రశ్నకర్త:** రియల్ (ఆత్మ) పక్షమా లేదా రిలేటివ్ (పుద్గల్) పక్షంలో కళ్యాణం గురించి మీరు మాట్లాడుతున్నారా?

**దాదాశ్రీ:** పుద్గల్ కాదు, మనకు 'రియల్' తరపున వెళ్ళేదే అవసరం. ఆ తరవాత 'రియల్' యొక్క సహాయముతో (రిలేటివ్ లో) ముందుకు సాగుతాము. ఆ 'రియల్' ను పొందితే, ఖచ్చితంగా 'రిలేటివ్' ని పొందుతాము! సమస్త ప్రపంచం యొక్క కళ్యాణం జరగాలనే భావనను పెంపొందించుకోండి. మీరు ఇది ఊరికే చెప్పటం కోసం చెప్పకూడదుబీ భావన భావించండి. ప్రజలు కేవలం పాడుతూ ఉంటారు, శ్లోకాలు పఠిస్తున్నట్లుగా.

**ప్రశ్నకర్త:** కేవలం పనిలేకుండా కూర్చోవడానికి బదులుగా, అటువంటి ఉద్దేశాన్ని(భావనని) పెంపొందించుకోవడం ఉత్తమమైనదిగా పరిగణించబడుతుంది, కాదా?

**దాదాశ్రీ:** చాలా మంచిది. కనీసం ప్రతికూలమైన ఉద్దేశాలు నాశనం అయ్యాయి కదా! ఇందులో ఎంత కుదిరితే అంత, సంపాదించారు కదా!

**ప్రశ్నకర్త:** ఈ ఉద్దేశాన్ని 'మెకానికల్ భావన' అనవచ్చునా?

**దాదాశ్రీ:** లేదు. అది మెకానికల్ అని ఎలా పరిగణించబడుతుంది? మెకానికల్ అంటే, ఎవరైనా వారికీ ధ్యాస లేకుండా, ఊరికే చాలా ఎక్కువగా చెబుతూ ఉంటె, దానిని మెకానికల్ అనవచ్చు!

## ఇందులో అసలు ఏమీ చేయాల్సిన అవసరం లేదు

**ప్రశ్నకర్త:** ఈ తొమ్మిది కలములలో, 'నాకు శక్తిని ఇవ్వండి, నాకు శక్తిని ఇవ్వండి', అని రాసి ఉంది, మరి ఇలా చదవడం ద్వారా మనం శక్తిని పొందగలమా?

**దాదాశ్రీ:** తప్పకుండా! ఇవి జ్ఞాని పురుష్' యొక్క మాటలు!! ప్రధాన మంత్రి నుండి లేఖ, మరియు ఒక వ్యాపారి నుండి లేఖ మధ్య తేడా లేదు?! ఎందుకు స్పందించడం లేదు మీరు? అవును, కాబట్టి ఇవి జ్ఞాని పురుషుని మాటలు. దీనిలో ఎవరైనా బుద్ధిని ప్రయోగిస్తే, వారికి పిచ్చి పడుతుంది. ఇవి బుద్ధికి మించిన విషయాలు.

**ప్రశ్నకర్త:** కానీ దానిని అమలులోకి తీసుకురావడానికి, ఇక్కడ వ్రాసినది నేను చేయాలి, కాదా?

**దాదాశ్రీ:** లేదు, ఇది చదవడానికి మాత్రమే. అది దానికదే అమలులోకి వస్తుంది. కాబట్టి మీరు (తొమ్మిది కలములు) ఈ పుస్తకాన్ని మీ దగ్గర ఉంచుకొని ప్రతిరోజూ చదవండి. మీరు ఇక్కడ ఉన్న జ్ఞానం అంత నేర్చుకుంటారు. మీరు ప్రతిరోజూ ఇది చదవడం కొనసాగిస్తున్నప్పుడు, 'ప్రాక్టీస్' అయిపోతుంది. మీరు ఆ రూపంగా మారుతారు. మీరు దీని నుండి పొందిన లాభమేంటో ఈ రోజు అంత స్పష్టంగా కనిపించదు ! కానీ క్రమంగా, ఇది మీకు 'ఎగ్జాక్ట్' అయిపోతుంది.

ఈ శక్తిని కోరడం వల్ల తరవాత దీని ఫలితం ఖచ్చితంగా మీ ప్రవర్తనలోకి వస్తుంది. కాబట్టి మీరు 'దాదా భగవాన్' నుండి శక్తిని అడగాలి. మరియు 'దాదా భగవాన్' దగ్గర అపరిమిత, అనంతమైన శక్తులు ఉన్నాయి, ఏది అడిగితే అది పొందుతారు! కాబట్టి ఈ శక్తిని అడగడం ద్వారా, ఏమి జరుగుతుంది?

**ప్రశ్నకర్త:** శక్తి లభిస్తుంది!

**దాదాశ్రీ:** అవును, వీటిని (కలములను) అనుసరించే శక్తి పుడుతుంది, మరియు ఆ తర్వాత, మీరు వాటిని అనుసరించగలరు. ఇవి ఊరికే అలా అనుసరించలేరు. అందువలన,మీరు శక్తి కోసం అడుగుతూ ఉండాలి. ఇంకేమి చెయ్యనవసరం లేదు, వ్రాయబడిన విధంగా ప్రవర్తన వెంటనే మారదు. మరియు అవదు కూడా. మీ ద్వారా ఎంత కుదురుతుందో అది తెలుసుకోండి, 'ఇంత జరుగుతుంది, మరియు ఇంత జరట్లేదు', అని. అనుసరించలేని దానికి క్షమాపణ అడగండి. మరియు, దానితో పాటు, ఈ శక్తిని అడగండి, దీని ద్వారా శక్తిని పొందుతారు.

## శక్తిని అడిగి పనిని సాధించండి!

నేను ఒక వ్యక్తితో ఇలా అన్నాను, 'ఈ తొమ్మిది కలములలో ప్రతిదీ ఆవరించి ఉంది. ఇందులో ఏమీ వదిలిపెట్టలేదు. మీరు ఈ తొమ్మిది కలములు ప్రతి రోజు చదవండి!' దానికి అతను, 'కానీ ఇది కుదరదు' అని జవాబిచ్చాడు. అప్పుడు నేను, 'మీకు ఏమీ చేయమని చెప్పడం లేదు.'కుదరదని ఎందుకు చెప్తున్నారు? మీరు కేవలం ఇంతే చెప్పాలి, 'హే దాదా భగవాన్, నాకు శక్తిని ఇవ్వండి.' నేను శక్తిని అడగమని చెప్పాను. అప్పుడు అతను, 'అయితేమజా వస్తుంది!'అన్నాడు. ప్రపంచంలో సాధారణంగా ప్రజలు మనకు 'చేయడం' నేర్పిస్తారు (మన ప్రవర్తనను మెరుగుపరచడానికి).

అప్పుడు అతను నన్ను అడిగాడు, 'ఈ శక్తిని ఎవరు ఇస్తారు?' నేను చెప్పాను, 'శక్తిని నేను ఇస్తాను.' మీరు అడిగే శక్తులు ఇవ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను. శక్తులు ఎలా అడగాలో మీకే తెలియదు, కాబట్టి ఈ విధంగా అడగాలని నేనే నేర్పించవలసి వస్తుంది. ఇలా శక్తి అడగాలి. మీకు నేర్పించాలి, కాదా? చూడు, నేను నీకు ఇవన్నీ నేర్పించాను కదా! ఇవి నేను మీకు నేర్పించిన విషయాలు కాదా? అప్పుడు అతను అర్థం చేసుకున్నాడు. తరవాత అతను అన్నాడు, 'ఇంత చేయవచ్చు, ఇందులో అన్ని వచ్చేసాయి !'

మీరు దీన్ని చేయవలసిన అవసరం లేదు. అస్సలు ఏమీ చేయకండి. హాయిగా, మీరు రోజూ తినేదానికంటే రెండు రొట్టెలు ఎక్కువ తినండి, కానీ ఈ శక్తిని అడగండి. అప్పుడు అతను నాతో, 'ఈ విషయం నాకు నచ్చింది', అన్నాడు.

**ప్రశ్నకర్త:** మొదట్లో, ఈ సందేహం చాలా ఉండేది, 'శక్తిని అడిగితె వస్తుందా లేదా?

**దాదాశ్రీ:** ఆ సందేహమే తప్పని రుజువవుతుంది. ఇప్పుడు మీరు ఆ శక్తిని అడుగుతున్నారు, కదా! కాబట్టి ఆ శక్తి లోపల ఉత్పన్నమైన తరవాత ఆ శక్తులే కార్యాలు చూపిస్తాయి. మీరు చేయవలసిన అవసరం లేదు. మీరు చేస్తే 'ఇగోయిజం' పెరిగిపోతుంది. 'నేను చేయడానికి ప్రయత్నిస్తున్నాను కానీ అది జరగట్లేదు,' ఇలా అంటారు. కాబట్టి కేవలం శక్తిని అడగండి.

**ప్రశ్నకర్త:** ఈ తొమ్మిది కలములలో, మనం శక్తిని అడుగుతున్నాము, 'ఇలా చేయకూడదు, చేయించకూడదు, అనుమోదించకూడదు,' అంటే దీని అర్థం, భవిష్యత్తులో ఇలా జరగకుండా ఉండడానికి మేము శక్తిని అడుగుతున్నామా, లేదా ముందు (గతంలో) చేసినవి కడగడానికా?

**దాదాశ్రీ:** గతంలో చేసిన పనులు కడిగిపోతాయి, మరియు శక్తులు ఉత్పన్నమవుతాయి. శక్తులు ఇప్పటికే ఉన్నాయి, కానీ ఇవి కడగడం ద్వారా ఈ శక్తులు వ్యక్తం అవుతాయి. అందుకే దాదా భగవాన్ యొక్క కృపను అడుగుతున్నాం, 'మా ఇవి కడిగిపోతే, శక్తులు వ్యక్తమవుతాయి.'

**ప్రశ్నకర్త:** నేను ఇదంతా చదివానుబీ ఇది నిజానికి ఒక అసాధారణ చర్చ. ఒక సాధారణ వ్యక్తి అయినా దీన్ని అర్థం చేసుకుంటే, అతని జీవితమంతా ఆనందంగా గడిచిపోతుంది.

**దాదాశ్రీ:** అవును, లేకపోతే అతనికి అర్థం చేసుకో తగిన విలువైనది ఏమీ దొరకలేదు (ఇప్పటి వరకు). ఇది మొదటి సారి విలువైన, అర్థం చేసుకో తగినది దొరికింది. ఇప్పుడు ఇది పొందితే ఇక పరిష్కారం వస్తుంది.

ఈ తొమ్మిది కలములలో ఏదైతే మన ద్వారా స్వయంచాలకంగా అనుసరింప బడుతుందో, దానికి ఎటువంటి సమస్య లేదు. కానీ మీరు వాటిని అనుసరించలేకపోతే,

అప్పుడు మీ మనస్సులో దాని కోసం పశ్చాత్తాపం చెందే అవసరం లేదు. మీరు చేయాల్సిందల్లా కేవలం శక్తి కోసం అడగడమే. ఆ శక్తి పేరుకుపోతూనే ఉంటుంది. లోపల శక్తి డిపాజిట్ చేయబడుతూ ఉంటుంది. అప్పుడు పని స్వయంచాలకంగా పూర్తి అవుతుంది. నిజానికి, ఈ తొమ్మిది కలములు అన్నీసెటప్ చేయబడుతుంది, మీరు శక్తిని అడిగిన వెంటనే ! కాబట్టి మీరు కేవలం వాటిని చెబితే చాలు. వాటిని చెబితే, మీరు శక్తిని అడిగినట్టే, కాబట్టి మీరు శక్తిని పొందుతారు.

## 'భావన' తో భావశుద్ధి!

**ప్రశ్నకర్త:** మీరు చెప్పారు కదా, హుక్కా తాగుతూ ఉండండి కానీ లోపల ఇది సాగుతూ ఉండాలి, "నాకు ధూమపానం చేయకుండా, చేయనివ్వకుండా, చేయడానికి అనుమోదించకుండా ఉండడానికి...'

**దాదాశ్రీ:** అవును, కాబట్టి దీని అర్థం ఏంటంటే, 'మాకు దీనిలో సహామతి లేదు', ఇదే చెప్పాలనుకుంటున్నాము. కాబట్టి మీ అభిప్రాయం చర్యకు భిన్నంగా ఉందని అర్థం. మరియు హుక్కా దానంతట అదే వెళ్లిపోయినప్పుడు, అది మంచిది. కానీ ఇప్పుడు మీరు దానికి కట్టుబడి లేరు, అదే మీకు కట్టు బడి ఉంది. దాని కాలం పూర్తి అయినప్పుడు అది వెళ్ళిపోతుంది, అదే మేము మీకు చెప్పదలచుకొన్నాము. ఒకవైపు హుక్కా తాగుతూ ఉండి, మరోవైపు భావన చెప్తూ ఉంటే, క్రమంగా అప్పుడు తాగిందంతా ఎగిరిపోతుంది, మరియు ఈ భావన మొదలవుతుంది.

మీరు ఎవరి ఇంటికి అయినా చెప్పకుండా వెళ్ళినప్పుడు, ఆ వ్యక్తి "రండి సార్, రండి సార్" అని చెప్పవచ్చు, కానీ అతను లోపల ఏమి అనుకుంటాడంటే, 'అతను ఇప్పుడే ఎందుకు రావాలి?' అంటే అతను చేసే మంచికి విరుద్ధంగా మనస్సులో చెబుతున్నాడు. కానీ ఇక్కడ ఏమి చెబుతున్నాడు? హుక్కా తాగుతున్నాడు కానీ, 'ఇది ఇలా జరగకూడదు'. అంటే అతను దీనికి విరుద్ధంగా చెబుతున్నాడు. బయట 'రండి, రండి' అంటున్నాడు, కానీ మళ్ళీ లోపల ఏమంటున్నాడంటే, 'అతను ఇప్పుడే ఎందుకు రావాలి?' కాబట్టి, అతను మెరుగుపడిన దానిని పాడు చేస్తున్నాడు. మీరు పాడైన దానిని మెరుగు పరుస్తున్నారు.

**ప్రశ్నకర్త:** మొత్తం అక్రం విజ్ఞానం యొక్క ఆశ్చర్యకరమైన విషయం ఏంటంటే, బయట చెడిపోయి ఉంది కానీ లోపల మెరుగుపడుతోంది.

**దాదాశ్రీ:** అవును, అందుకే మనం సంతృప్తిగా ఉన్నాం కదా! 'ప్రస్తుత పరిస్థితి (జీవితం) చెడిపోయి ఉంటే పర్వాలేదు, కానీ కొత్తది ఖచ్చితంగా మెరుగ్గా ఉండబోతుంది' అని. ఇప్పుడు వ్యర్థమైంది ఎప్పటికీ చరిత్ర అయ్యి పోతుంది, కానీ కనీసం కొత్తది బాగుంటుంది, కాదా? అయితే కొంతమంది ఏమంటారు? 'మాకు ఈ జీవితాన్ని మెరుగుపరచడం మాత్రమే కావాలి'. హే, అది వదలండి. ఇలా అయితే తదుపరిది కూడా చెడిపోతుంది. ఇదీ పోయింది, మరియు అదీ పోయింది, రెట్టింపు నష్టం.

**ప్రశ్నకర్త:** ప్రస్తుతం చెడిపోయిన దానికి జవాబుదారి ఇప్పుడు మాకు లేదు. ఇది గత జన్మ ఫలితం.

**దాదాశ్రీ:** అవును, ప్రస్తుతం మనకు జవాబుదారి లేదు. ఆ అధికారం ప్రస్తుతం మరొకరి చేతిలో ఉంది. జవాబుదారి మన చేతిలో లేదు కదా! ఇది నిజానికి మారేది కాదు, మరి మీరు ఎందుకు అనవసరంగా అశాంతిని చెందుతున్నారు! కానీ అక్కడ మత గురువు కూడా ఇలా అంటాడు, 'మీరు ఇలా చేయలేకపోతే, మీరు లోపలికి అనుమతించబడరు.' అప్పుడు అతని అనుచరుడు ఏమంటాడంటే, 'కానీ సార్, నేను దీన్ని నిజంగా చేయాలనుకుంటున్నాను, కానీ నాకు అది సంభవించట్లేదు, మరి నేను ఏమి చెయ్యగలను?' కాబట్టి, ఇదంతా అర్థం చేసుకోక పోవడం వల్ల తప్పు జరుగుతుంది.

**ప్రశ్నకర్త:** ఈ ప్రకృతి (నాన్-సెల్ఫ్ కాంప్లెక్స్) తలక్రిందులుగా ప్రవర్తించినప్పుడు, ఇతనికి లోపల విపరీతమైన 'సఫోకేషన్ (ఊపిరాడ కుండా)' ఉంటుంది.

**దాదాశ్రీ:** అర్రే, అలాంటిది జరిగినప్పుడు అతను ఐదు రోజులు తినడు. అయ్యో, తప్పు ఎవరిది మరియు ఎవరు దాని కోసం శిక్షించబడుతున్నాడు! కడుపుని ఎందుకు శిక్షిస్తున్నారు? తప్పు మనస్సు యొక్కది కానీ కడుపుని శిక్షిస్తాడు. అతడు, 'నీవు తినవద్దు' అని అంటాడు. మరి అతను ఏమి చెయ్యగలడు, పాపం?! అతని శక్తి తగ్గిపోతుంది కదా! ఒకవేళ అతను తిని

ఉండిఉంటే, అతను వేరే పని చేయగలడు. అందుకే మన వాళ్ళు ఏమంటారంటే, 'గేదె చేసిన తప్పుకి భస్తిని ఎందుకు శిక్షిస్తున్నారు?' తప్పు గేదెది (మనసుది), మరి భస్తి (శరీరం) యొక్క తప్పు ఏమిటి?!

అంతేకాకుండా, బయట క్లియర్ చేయడం ద్వారా ఏమి పొందుతారు? దానిపైన మనకు నియంత్రణ లేదు! మరి అనవసరంగా అరవడం వలన ప్రయోజనం ఏమిటి? లోపల ఉన్న చెత్త అంతా ఊడ్చివేయాలి, లోపల అంతా శుభ్రం చేయాలి. బదులుగా, ప్రజలు బయట శుభ్రపరుస్తారు, వారు గంగా నదిలో వెళ్ళినప్పుడు, వారి శరీరాలను ముంచెత్తడం చేస్తూ ఉంటారు. అరె, దేహాన్ని ముంచడం (కడగడం) వలన ఉపయోగం ఏమిటి? మనసును కడుక్కోవచ్చు కదా! మనసుని, బుద్ధిని, చిత్తాన్ని, అహంకారాన్ని ఈ అందరిని మొత్తం ఆత్మను కడగాలి. వీటిపై సబ్బును ఎప్పుడూ ఉపయోగించలేదు, కాబట్టి అవి మురికిగా మారతాయా లేదా?

చిన్న వయస్సులో ఉన్నంత వరకు అంతా బాగానే ఉంటుంది. ఆ తర్వాత ప్రతి రోజు మురికిగా మారతాయి మరియు ఆ తర్వాత, చెత్త సేకరిస్తుంది. అందుకే నేను, 'మీ ప్రవర్తన బయట వదిలేయండి, మరియు మీతో పాటు తొమ్మిది కలములు దీన్ని తీసుకెళ్ళండి. ఈ అబద్ధాలని బయట వదిలేయండి, మరియు కలములు భావిస్తూ ఉండండి, అప్పుడు మీ వచ్చే జన్మ అగ్రస్థానంలో ఉంటుంది!

**ప్రశ్నకర్త:** ఈ 'జ్ఞానాన్ని' తీసుకోని వ్యక్తులు కూడా వారి ప్రవర్తనను ఈ విధంగా మార్చ గలరు కదా?

**దాదాశ్రీ:** అవును, వారు ప్రతిదీ మార్చగలరు. ప్రతి ఒక్కరికి ఈ కలములను పఠించే స్వేచ్ఛ ఉంది.

**ప్రశ్నకర్త:** ఏదైనా చెడు జరిగినప్పుడు, ఈ కలములు దానిని కడగడానికి ఒక శక్తివంతమైన పరిష్కారం.

**దాదాశ్రీ:** నిజానికి ఇది గొప్ప పురుషార్థం. కాబట్టి 'మేము' ఇది అన్నిటికంటే గొప్ప శాస్త్రం వెల్లడించాము. (మేము దానిని తెరచాము) అయితే, ప్రజలలో అవగాహన రావాలి

కదా! అందుకే దీన్ని తప్పనిసరి చేశాను, 'మీరు ఇంత చేయాలి', అని. మీకు అర్థం కాకపోయినా, దీన్ని తాగండి (ఔషధం-తొమ్మిది కలములు).

**ప్రశ్నకర్త:** అంతర్గత వ్యాధులు నశిస్తాయి.

**దాదాశ్రీ:** అవును, నాశనం అయిపోతాయి. 'దాదా' చెప్పారు 'చదవండి' అని, కాబట్టి చదవాలి, అంతే. చాలు! ఇది జీర్ణించుకోవడానికి కాదు. ఇది టాబ్లెట్‌ను కరిగించి తాగడం, మరియు హాయిగా తిరగడం వంటిది!

**ప్రశ్నకర్త:** ఈ మాట నిజమేనా, 'భావం చేయడం వల్ల పాత్రత పెరుగుతుంది' అనేది?

**దాదాశ్రీ:** భావమే నిజమైన పురుషార్థం. ఈ ఇతర భాషణలన్నీ నిరాధారమైనవి. కర్తా స్థితి నిజానికి బంధన స్థితి, అయితే ఈ భావం అనేది విముక్తికి దారితీసే స్థితి. 'ఇది చేయి, అలా చేయి, అలాంటివి చేయి,' అని ప్రజలు వీటి వల్ల బంధించబడి ఉన్నారు కదా!

## భావన ఫలిస్తుంది వచ్చే జన్మలో

**ప్రశ్నకర్త:** ఎప్పుడైనా నా ద్వారా ఎవరైనా అహంకారాన్ని దెబ్బతీయడం జరిగితే, అప్పుడు ఈ కలము వాడితే, '... ఏ జీవి యొక్క అహాన్ని దెబ్బతీయకుండా...'?

**దాదాశ్రీ:** ఆ సమయంలో నువ్వు 'చందూభాయ్'కి చెప్పాలి, 'నువ్వు అతనికి కలిగించిన బాధకు ప్రతిక్రమణ్ చేయి.' మరియు వేరే చిన్న చిన్న విషయాలలో విసిగించవద్దు. ఏమైనప్పటికీ, సాధారణంగా అహాన్ని దెబ్బ తీసేటటువంటి లక్షణాలు తీవ్రంగా ఉండవు. మరియు ఎవరైనా కొంచెం బాధపడినట్లైతే, అప్పుడు అతనితో ('చందుభాయ్') దాని కోసం ప్రతిక్రమణ్ చేయించండి.

వాస్తవానికి, ఈ భావనలు భావించాలి. ఇప్పటికి ఇంకొక అవతారం మిగిలి ఉంది కదా, అప్పుడు ఈ భావనలు ఫలాన్ని ఇస్తాయి. నిజానికి అప్పుడు మీరు భావన రూపమే పొంది ఉంటారు. ఎలాంటి భావనలు అయితే రాసి ఉన్నాయో, అలాంటి ప్రవర్తన వచ్చి ఉంటుంది,

కానీ అది వచ్చే జన్మలో ! ఇప్పుడు విత్తనాలు నాటారు, కాబట్టి ఇప్పుడు మీరు ఇలా అంటే, 'రండి, దీనిని తొవ్వి తినేద్దాం, అంటే కుదరదు.

**ప్రశ్నకర్త:** పరిణామము ఈ జీవితంలో రాదు, అది వచ్చే జన్మలో వస్తాయా?

**దాదాశ్రీ:** అవును, ఇప్పటికీ ఒకటి రెండు జీవితాలు మిగిలి ఉన్నాయి. అంటే మేము ఈ విత్తనాలను ఎందుకు విత్తుతున్నాము అంటే, తద్వారా తదుపరి జీవితంలో అన్నీ 'క్లియర్'గా ఉంటాయి. ఇది విత్తనాలు విత్తుకోవాలనుకునే వారి కోసం.

**ప్రశ్నకర్త:** కాబట్టి మనం వీటిని నిరంతరం పఠించాలా, అంటే ఎప్పుడెప్పుడైతే ఏమైనా సంఘటనలు జరుగుతాయో, దాని బట్టి?

**దాదాశ్రీ:** లేదు, ఆ సంఘటన మరియు ఈ భావనలకు ఒకదానితో ఒకటి సంబంధం లేదు. ఈ సంఘటనకు దీనితో సంబంధం ఏమిటి?! సంఘటన ఆధారం లేనిది!మరియుఈ భావనలు ఆధారం ఉన్నవి. ఈ భావనలు మీతో పాటు రాబోతున్నాయి , కానీ ఈ సంఘటనలు మాత్రం వెళ్లిపోతాయి.

**ప్రశ్నకర్త:** కానీ సంఘటనల ఆధారంగా ఈ భావనలు చేయవచ్చు కదా?

**దాదాశ్రీ:** లేదు. సంఘటనతో ఏ సంబంధం లేదు. భావన అనేది మాత్రమే మీతో ముందుకు వస్తుంది. ఈ సంఘటన ఎటువంటి ఆధారం లేకుండా ఉంది, అది వెళ్ళిపోతుంది. ఎంత అద్భుతమైన సంఘటన అయినా సరే, అది కూడా గడిచిపోతుంది. ఇది దేని వలన అంటే, ఇది తలెత్తిన పరిస్థితి, మరియు ఈ భావనలు పెంచుకోవలసినవి. ఇప్పటికీ వీటి సంయోగాలు ఏర్పడడం బాకీ ఉంది.

**ప్రశ్నకర్త:** అయితే ఈ సంఘటనల వల్ల మన భావనలో మార్పు వస్తుంది, అప్పుడే ఈ భావనను ఉపయోగించి మళ్ళీ భావాన్ని మార్చాలి కదా?

**దాదాశ్రీ:** కానీ అది ఏమి సహాయం చేయదు. గత జీవితంలో ఎంతవరకైతేచేసారో, అది ఇప్పుడు హెల్ప్ చేస్తుంది. అవును, మీరు పూర్వంలో కొంచం చేసినట్లయితే, అప్పుడే ఈ జన్మలో పూర్తిగా మలుపు తిరుగుతుంది.

**ప్రశ్నకర్త:** కాబట్టి, సంఘటనల విషయంలో, గత జన్మలో భావం ఉండి ఉంటే, అవి ఇప్పుడు పరిణామము చెందుతాయా?

**దాదాశ్రీ:** అవే అమల్లోకి వస్తాయి. వేరే ఏవీ రావు. భావము అంటే బీజము, మరియు ద్రవ్యం అంటే పరిణామము, పంట. ఒక జొన్న విత్తనం నాటినట్లయితే, ఇంత పెద్ద పంట పండుతుంది!

ఈ కలములు కేవలం చెప్పాలి, అంతే. ప్రతి రోజు, కేవలం భావన భావించాలి. విత్తనం వేయాలి. నాటిన తర్వాత, అది ఫలాన్ని ఇచ్చినప్పుడు దాని ప్రభావాన్ని చూడండి. అప్పటి వరకు ఎరువులు వేయండి. అంతేకాని, ఈ సంఘటనలలో ఏమి ఇలా మార్చేది లేదు. మరియు ఇప్పుడు ఉన్నవంతా పాతవే.

కాబట్టి ఈ తొమ్మిది కలములు ఏం చెబుతున్నాయి ? 'హే దాదా భగవాన్, నాకు శక్తిని ఇవ్వండి.' ఇప్పుడు ప్రజలు ఏమంటారు? 'ఇవి అనుసరించడం సాధ్యము కాదు.' కానీ ఇది చేసే అవసరం లేదు. అరే, ఎందుకు పిచ్చిగా ప్రవర్తిస్తున్నారు! ఈ ప్రపంచంలో అందరూ 'ఇది చేయి, ఇది చేయి, ఇది చేయి' అనే చెప్పారు. హే, అక్కడ చేసేది ఏమి లేదు, కేవలం తెలుసుకోవాలి. మరియు తరవాత, 'నేను ఇలా చేయకూడదు మరియు దానికి నేను పశ్చాత్తాప పడుతున్నాను.' ఇలా దాదా భగవాన్ దగ్గర క్షమాపణ అడగాలి. ఇప్పుడు, 'ఇది చేయకూడదు' అని చెప్పారు కదా, అప్పటినుంచి మీ అభిప్రాయము భిన్నమైంది. ఆ తరవాత మళ్ళీ ఆ పని చేసినా ఇబ్బంది లేదు. కానీ అభిప్రాయం భిన్నంగా మారినందు వల్ల, మీరు (బాధ్యత నుండి) విముక్తి పొందారు! ఇదే మోక్ష మార్గం యొక్క రహస్యం, ప్రపంచానికి దాని గురించి తెలియదు!

**ప్రశ్నకర్త:** వారికి 'డిశ్చార్జ్' లోనే మార్పు కావలి, పరిణామములో మార్పు తీసుకురావాలనుకుంటున్నారా ఈ ప్రజలు?

**దాదాశ్రీ:** అవును, కాబట్టి ప్రపంచానికి ఈ లక్ష్యము గురించే తెలియదు, దీని భానమే లేదు. నేను వీరిని అభిప్రాయము నుండి విడిపించేందుకు ప్రయత్నిస్తున్నారు. ప్రస్తుతం, 'ఇది తప్పు,' అనే అభిప్రాయం మీ లోపల ఏర్పడింది. ఎందుకంటే, ఇంతకు ముందు, 'ఇది

సరైనది’ అనే అభిప్రాయం ఉండేది, మరియు దాని ద్వారా సంసారము నిశ్చలంగా నిలబడింది. మరియు ఇప్పుడు, ‘ఇది తప్పు,’ అని మీరు అభిప్రాయపడుతున్నారు, కాబట్టి ముక్తిని పొందారు. ఇప్పుడు ఈ అభిప్రాయం మళ్ళీ ఎలాంటి పరిస్థితిలోనైనా మారకూడదు!

మీరు ప్రతిరోజూ ఈ తొమ్మిది కలములను చెబితే, క్రమంగా ఎవరితోనూ గొడవలు, తుఫాను ఉండవు. ఎందుకంటే మీ భావము కుప్పకూలిపోయింది. ఇప్పుడు మిగిలింది ఒక్కటే, అది ప్రతిచర్య (‘రియాక్షనరీ’). అది క్రమంగా తగ్గుతూనే ఉంటుంది.

## మహాత్ములకి ఇది ఛార్జ్ లేదా డిశ్చార్జ్?

**ప్రశ్నకర్త:** భావం మరియు భావన, ఈ రెండిటి మధ్య తేడా ఏమిటి?

**దాదాశ్రీ:** ఈ రెండు ‘చందుభాయ్’ కిందకు వస్తాయి! కానీ అదినిజమే, భావం మరియు భావన మధ్య తేడా ఉంది.

**ప్రశ్నకర్త:** భావన పవిత్రంగా ఉంటుంది, మరియు భావం అయితే మంచి లేదా చెడుగా కూడా ఉండవచ్చు.

**దాదాశ్రీ:** లేదు, భావన పవిత్రంగా ఉంటుంది అని ఏమి లేదు. భావన అపవిత్రతకి కూడా వర్తిస్తుంది. ఒకరి ఇంటిని తగలబెట్టే భావన కూడా కలిగి ఉండ వచ్చు, మరియు ఒకరికి ఇల్లు కట్టించే భావన కూడా ఉండవచ్చు. కాబట్టి భావన రెండు వైపులా ఉపయోగించవచ్చు, కానీ భావం, దీనిని ఛార్జ్‌గా పరిగణించబడుతుంది మరియు భావన, ఇది డిశ్చార్జ్.

మన లోపల కలిగేది, ‘నాకు ఇది చేసే భావం ఉంది, ఇలా చేయాలి.’ ఇది కూడా భావన, ఇది భావం కాదు. నిజానికి ఛార్జ్ అయ్యేటప్పుడు ఉండే దానినే భావం అంటారు.

కాబట్టి, భావకర్మ వల్లనే ఈ ప్రపంచం ఉనికిలోకి వచ్చింది. మీరు ఏదైనా సరే చేయలేక పోతే, దీన్ని చేయడానికి భావం ఉంచాలి. మీకు (మహాత్మలు-ఆత్మజ్ఞానం పొందిన వారు) భావాన్ని తొలగించాను. బయట ప్రజలు (ఆత్మజ్ఞానం లేని వారు) భావకర్మ చేయాలి. అంటే, వారు శక్తిని అడగాలి. ఎవరికి ఏ శక్తి కావాలంటే, వారు అది దాదా భగవాన్‌ను అడగాలి.

**ప్రశ్నకర్త:** బయట ప్రజలు (ఆత్మజ్ఞానం లేని వారు) ఈ శక్తిని అడగాలి, మరి మన మహాత్ములు అడిగే శక్తి, చేసే భావన దేని కిందకి వస్తుంది?

**దాదాశ్రీ:** మహాత్మలు అడిగేవి డిశ్చార్జ్ కిందకు వస్తాయి. ఎందుకంటే భావనలో రెండు రకాలు ఉన్నాయి. ఛార్జ్ మరియు డిశ్చార్జ్. ప్రాపంచిక వ్యవహారంలో ఉన్న వ్యక్తులకు కూడా భావన ఉంటుంది మరియు మనకు కూడా ఇక్కడ భావన ఉంటుంది. కానీ మనది డిశ్చార్జ్ రూపంలో ఉంది. మరియు వారికి డిశ్చార్జ్ మరియు ఛార్జ్ రెండింటి రూపంలోను భావన ఉంటుంది. కానీశక్తిని అడగడం వల్ల వచ్చే నష్టం ఏమిటి?

**ప్రశ్నకర్త:** ఆత్మ జ్ఞానం లేని వారు తొమ్మిది కలముల ద్వారా ఈ శక్తులు అడిగినప్పుడు దానిని భావంగా పరిగణించబడుతుంది, మరి మహాత్ములు శక్తిని అడిగితే అది భావం అనలేమా?

**దాదాశ్రీ:** ఆత్మజ్ఞానం లేని వారికి ఇది భావం, మరియు మన మహాత్మలకు ఇది భావన. అది నిజం. అది భావం, అంటే ఛార్జ్‌గా పరిగణిస్తారు. మరియు ఇదిభావన, అంటే డిశ్చార్జ్ గా పరిగణించబడుతుంది, దీనిని భావం అని అనలేము!

## భావం, ఎగ్జాక్ట్ డిజైన్‌కు అనుగుణంగా

**ప్రశ్నకర్త:** ఈ తొమ్మిది కలములు ఉన్నాయి కదా, వీటిలో చెప్పిన విధంగానే మా భావన, కోరిక, అభిప్రాయాలు, అన్నీ కూడా ఉంటాయా?

**దాదాశ్రీ:** ఒకరు ఇంతకు ముందు చేస్తున్నట్టే ఇప్పుడు కూడా చేస్తున్నట్టు కనిపించవచ్చు, కానీ అలా ఉండదు. ఇటువైపు వంపు ఉంది అనేది నిజం. కానీ ఈ వంపు ఖచ్చితంగా ఈ రకంగా ఉండాలి. డిజైన్‌కు అనుగుణంగా ఉండాలి. వంపు ఉంటుంది, సాదు-సన్యాసులను వేధించకూడదనే కోరిక ఉంటుంది కదా! కానీ అది డిజైన్‌కు అనుగుణంగా ఉండాలి.

**ప్రశ్నకర్త:** డిజైన్‌కు అనుగుణంగా అంటే ఏ విధంగా, 'దాదాశ్రీ?'

**దాదాశ్రీ:** ఇక్కడ (తొమ్మిది కలములలో) రాసిన దానికి అనుగుణంగా, ఎగ్జాక్ట్నెస్. లేకపోతే, సాధారణంగా సాదు-సన్యాసులను వేధించకూడదనే కోరిక ఎవరికైనా ఉంటుంది,

అయినా సరే, వీరు వేధిస్తున్నారు. దీనికి కారణం ఏమిటి? అప్పుడు ఏమంటారంటే, 'వీరిది డిజైన్‌కు అనుగుణంగా లేదు'. ఇది డిజైన్‌కు అనుగుణంగా ఉంటే ఇలా జరగదు.

**ప్రశ్నకర్త:** ఈ తొమ్మిది కలములను అవగాహనతో మన జీవితాల్లోకి చేర్చాలా?

**దాదాశ్రీ:** లేదు, అది అవగాహనతో జీవితంలోకి చేర్చవలసిన అవసరం లేదు. మేము తెలియజేసేది, కేవలం మేము ఇక్కడ చెప్పినట్లు శక్తిని అడగండి, అంతే. అది మిమ్మల్ని కచ్చితత్వానికి తీసుకువస్తుంది. మీరు దీన్ని అవగాహనతో చేయవలసిన అవసరం లేదు. ఇది ఎప్పటికీ జరగదు, ఒక వ్యక్తి చేయనే లేడు. ఎవరైనా అవగాహనతో చేయడానికి ప్రయత్నిస్తే, అది జరగదు. ప్రకృతి చేతిలో వదిలేయండి. అంటే 'హే దాదా భగవాన్, నాకు శక్తిని ప్రసాదించు.' శక్తి ఇట్సెల్ఫ్ (దానికదే) పుడుతుంది. ఆ తరవాత అది ఎగ్జాక్ట్ గా వస్తుంది.

ఇది చాలా ఉన్నతమైన విషయం. అర్థమయ్యే వరకు, ఇది ఇలా కొనసాగుతుంది!

నేను ఎందుకు అని ఉంటాను, 'శక్తిని అడగండి, శక్తిని ఇవ్వమని అడగండి' అని? ఎందుకంటే ఒకరు డిజైన్‌ని స్వయంగా తయారు చేయలేరు. అసలు డిజైన్‌ని ఎలా తయారు చేయగలడు?! అందువలన, ఇది 'ఇఫెక్ట్'. మీరు అడిగే ఈ శక్తి 'కాజ్', మరియు వచ్చేది 'ఇఫెక్ట్'. ఈ 'ఇఫెక్ట్' కూడా ఎవరి ద్వారావస్తుంది? దాదా భగవాన్ ద్వారా సులభతరం చేయబడింది. 'ఇఫెక్ట్' భగవంతుని ద్వారా రావాలి.

కాబట్టి ఒకరు తొమ్మిది కలముల ప్రకారం శక్తిని అడుగుతూ ఉంటే, స్వయంచాలకంగా తొమ్మిది కలములలో ఉంటాడు. చాలా సంవత్సరాల తర్వాత అతను తొమ్మిది కలములలోనే ఉంటాడు.

## ప్రాపంచిక సంబంధాల నుండి విముక్తి పొందాలంటే...

**ప్రశ్నకర్త:** ఈ తొమ్మిది కలములు ఆలోచనలు, వాణి మరియు ప్రవర్తన యొక్క శుద్ధీకరణ కోసం ఇవ్వబడింది, కాదా?

**దాదాశ్రీ:** లేదు, లేదు. ఇక్కడ ఆ అవసరం లేదు. అక్రమ్ మార్గంలో ఈ అవసరమే లేదు. ఈ తొమ్మిది కలములు, మీరు బంధించుకున్న కర్మల నుండి విముక్తి చెందడానికి, అనంత జన్మలు అందరితో కట్టుబడి ఉన్న ఖాతాల నుండి విముక్తిని పొందడానికి ఇవ్వబడ్డాయి. ఖాతా క్లియర్ చేయడానికి ఇవ్వబడ్డాయి.

కాబట్టి మీరు తొమ్మిది కలములు చెప్పినట్లయితే, అప్పుడు లింక్ బ్రేక్ అవుతుంది. వ్యక్తులతో సృష్టించబడిన లింక్, ఆ రూణానుబంధం మిమ్మల్ని మోక్షం పొందడానికి అనుమతించదు. కాబట్టి ఆ రుణానుబంధాలు బద్దలు కొట్టడం కోసమే ఈ తొమ్మిది కలములు ఉన్నాయి.

ఈ (తొమ్మిది కలములు) చెప్పడం ద్వారా, మీరు ఇప్పటి వరకు చేసిన తప్పులు అన్నీ విడదీయబడతాయి (ఢీలా పడుతుంది). మరియు తరువాత దీని ప్రభావం ఖచ్చితంగా వస్తుంది. కాలిపోయిన తాడు లాగా మారుతుంది, దానిని ఇలా చేయి తాకిస్తే చాలు, అది పడిపోతుంది.

**ప్రశ్నకర్త:** దోషాల ప్రతిక్రమణ్ చేయడానికి మేము తొమ్మిది కలములు పదే పదే ప్రతి రోజు చెబుతూ ఉంటే, దీనిలో శక్తి ఉంటుందా, మరి?

**దాదాశ్రీ:** మీరు చెప్పే తొమ్మిది కలములు వేరు, మరియు మీ తప్పులకు చేసే ప్రతిక్రమణ్ వేరు. ఏవైనా దోషాలు జరిగితే, వాటి ప్రతిక్రమణ్ ప్రతిరోజూ చేయాలి.

నిజానికి, తొమ్మిది కలములు చెప్పడం ద్వారా, అనంతమైన గత జీవితాలలో చేసిన రాగ-ద్వేషాలు, అన్నీ కర్మ బంధాలు విడుదలవుతాయి. ఇది ప్రతిక్రమణ్, ఇది అన్నిటికన్నా గొప్ప ప్రతిక్రమణ్. సమస్త ప్రపంచానికి ప్రతిక్రమణ్ ఈ తొమ్మిది కలములలో చేర్చబడింది. సరిగ్గా చేయండి. మేము మీకు చుపించి వెళ్తున్నాము, తరవాత మేము మా దేశానికి (మోక్షానికి) వెళ్ళిపోతాము కదా!

## తొమ్మిది కలములు జీవితాంతం ప్రవర్తనలో ఉండేది దాదాకి!

ఇది ఏంటంటే, ఈ కాలము కారణంగా ప్రజలకు శక్తి లేదు. ఎంత శక్తి ఉందో, అంతే ఇచ్చాము. ఇంత భావన భావిస్తే, వారు తదుపరి జీవితంలో మానవునిగా జీవ రూపాన్ని

కోల్పోరు, నేను దానికి హామీ ఇవ్వగలను. లేకపోతే, ప్రస్తుత కాలంలో, మానవునిలో ఎనభై శాతం జనాభా మానవునిగా తమ జీవన రూపాన్ని నిలుపుకోదు, అలా అయిపోయింది.

ఈ తొమ్మిది కలములలో అత్యున్నతమైన భావనలు కలిగి ఉన్నాయి. మొత్తం సారాంశం వాటిలో వచ్చేస్తుంది. ఈ తొమ్మిది కలములు నా జీవితమంతా అనుసరించానుబీ నిజానికి అవి నా సంపద. అంటే, నేను నా రోజువారీ అభ్యాసాలను వెల్లడించాను. ఇది అంతిమంగా ప్రజల సంక్షేమం కోసమే. ఈ తొమ్మిది కలములు చాలా సంవత్సరాలుగా ప్రతిరోజూ, గత నలభై సంవత్సరాలుగా నిరంతరంగా, లోపల నడుస్తూ ఉన్నాయి. వాటిని ఇప్పుడు ప్రజలకు అందిస్తున్నాను.

**ప్రశ్నకర్త:** ప్రస్తుతం మేము, 'హే దాదా భగవాన్, నాకు శక్తిని ఇవ్వండి.' అని అంటున్నాము. మరి మీరు ఈ తొమ్మిది కలములు ఎవరికి చెప్పేవారు?

**దాదాశ్రీ:** ఈ దాదా భగవాన్ ఉండకపోవచ్చు, అక్కడ వేరే పేరు ఉండవచ్చు, కానీ పేరు ఖచ్చితంగా ఉంది. నేను వాటిని ఆయననే సూచిస్తూ చెబుతూ ఉండేవాణ్ణి. అది 'శుద్ధాత్మ' అని చెప్పినా, లేకపోతే మరేదైనా చెప్పినా. కానీ నేను వాటిని ఆయననే సూచిస్తూ చెప్పేవాణ్ణి.

క్రమిక మార్గంలో ఒకరు పెద్ద గ్రంథాలను చదువుతారు, అయితే ఇక్కడ (అక్రంలో), ఈ తొమ్మిది కలములు మాత్రమే చెబితే, చాలు! తొమ్మిది కలములలో ఇంత శక్తి ఉంచబడింది. అద్భుతమైన శక్తి ఉంది, కానీ అదిసులభంగా అర్థం కాదు, కదా! నేను దానిని వివరించినప్పుడు మాత్రమే, అదిఅర్థం అవుతుంది. మరియు దీని విలువ అర్థమయింది అని ఎవరిని అనవచ్చంటే, నా దగ్గరకు వచ్చి చెప్తే, 'ఈ తొమ్మిది కలములు నాకు చాలా నచ్చాయి', అని. మరియు ఈ తొమ్మిది కలములు అర్థం చేసుకోదగినవి.

ఈ తొమ్మిది కలములు గ్రంథాలలో లేవు. కానీ 'మేము' అనుసరించేది ఎల్లప్పటికీ మా అమలులోనే ఉన్నాయి, అదే మీకు చేయమని ఇచ్చాము. మేము ప్రవర్తించే విధంగా ఈ తొమ్మిది కలములు రాయబడినవి. ఈ తొమ్మిది కలములకు అనుగుణంగా మా ప్రవర్తన ఉంటుంది, అయినప్పటికీ, మేము భగవంతునిగా పరిగణించబడము. భగవంతుడంటే, లోపల ఉన్న భగవంతుడే! అంతే కానీ మనిషి ఈ విధంగా ప్రవర్తించ లేడు.

పద్నాలుగు ప్రపంచాల సారాంశం ఇందులో ఉంది. ఈ రచించిన తొమ్మిది కలములు పద్నాలుగు ప్రపంచాల సారాంశం. మొత్తం పద్నాలుగు ప్రపంచాల పెరుగు ఉంటే, దానిని మథనం చేసి, వెన్న తీసి, నేను ఇక్కడ ఉంచాను. కాబట్టి, ఈ ప్రజలందరికీ ఎంత గొప్ప పుణ్యం ఉంది. వారు అక్రమ మార్గము యొక్క 'లిఫ్ట్' లో కూర్చొని మోక్షానికి వెళుతున్నారు. అవును, ఒక్కటే షరతు ఏమిటంటే, మీ చేతిని బయట ఉంచవద్దు!

ఈ తొమ్మిది కలములు ఎక్కడా కనిపించవు. తొమ్మిది కలములు పూర్ణ పురుషులు మాత్రమే వ్రాయగలరు. అలాంటి వ్యక్తి చాలా అరుదు! ఒకవేళ అతను ఉంటే, ప్రజలకు కల్యాణం అవుతుంది.

## వీతరాగ విజ్ఞానము యొక్క సారాంశం!

మరియు ఈ భావన చేసేటప్పుడు ఎలా ఉండాలి? వాటిని చదివేటప్పుడు, ప్రతి పదం ఇలా కనిపించాలి. ఒకవేళ 'మీరు చదువుతున్నప్పుడు' ఇలా 'కనిపిస్తే' అప్పుడు మీరు వేరే చోట నిమగ్నమయ్యి లేరు. ఈ భావన భావించేటప్పుడు మీరు మరెక్కడా ఉండ కూడదు. 'మేము' ఒక్క క్షణం కూడా వేరే చోటకు వెళ్లము. ఆ మార్గంలోకి మీరు కూడా రావాలి కదా? మేము ఉన్న చోటకి! ఈ భావన భవిస్తూ ఉంటే పూర్ణత ప్రారంభమవుతుంది. భావన మాత్రం కేవలం ఇంతే చేయాలి.

అవును, ఈ భావనలు మనసు-వాణి-శరీరం యొక్క ఐక్యతతో చెప్పండి. కాబట్టి ఈ తొమ్మిది కలములు ఖచ్చితంగా చేయండి. ఈ తొమ్మిది కలములు మొత్తం వితరాగ విజ్ఞానము యొక్క సారాంశం! మరియు ప్రతిక్రమణ్-ప్రత్యాఖ్యాన్ (తప్పును పునరావృతం చేయకూడదని అంగీకరించడం) అంతా దీనిలో ఆవరించి ఉంది. ఇలాంటి కలములు ఎక్కడా ప్రచురించబడలేదు. ఈ బ్రహ్మచర్య పుస్తకం వలె, ఈ కలములు కూడా ఎక్కడా ప్రచురించబడలేదు. ఈ కలములు ఎవరైనా చదివితే, ఈ భవనాలు భావిస్తే, ప్రపంచంలో ఎవరితోనూ ప్రతీకారం ఉండదు, అందరితో స్నేహం ఉంటుంది. ఈ తొమ్మిది కలములు అన్ని గ్రంథాల సారాంశం!

**-జై సచ్చిదానంద**

## శుద్ధాత్మకి ప్రార్థన

హే అంతర్యామీ పరమాత్మా! నీవు నాలో ఉన్నవిధంగానే జీవులందరిలో విరాజమానమై వున్నావు. నీ యొక్క దివ్య స్వరూపమే నా నిజ స్వరూపము. నా నిజ స్వరూపము పవిత్ర ఆత్మ.

హే శుద్ధాత్మ భగవాన్! నేను నీకు అభేదభావముతో అత్యంతభక్తి పూర్వకంగా నమస్కరించుచున్నాను.

అజ్ఞానవశాత్తు నేను చేసిన తప్పులనన్నింటిని ❖ నీ ముందు ఒప్పుకొనుచున్నాను. నేను ఈ తప్పులకు పశ్చాత్తాపం చెందుతూ నీ క్షమకై అర్థిస్తున్నాను. ప్రభూ! దయతో నన్ను క్షమించు, నన్ను క్షమించు, నన్ను క్షమించు. ఆ తప్పులను మరల చేయకుండునట్లు నాకు శక్తిని ప్రసాదించు.

హే శుద్ధాత్మ భగవాన్! మాకు నీతోగల భేద భావము తొలగిపోయి మేమందరము నీతో అభేదతను పొందునట్లు ఆశీర్వదించు. మేము సదా నీతో అభేదతతో తన్మయాకారతను చెందెదము గాక!

(❖ గతంలో నీవు చేసిన తప్పులను గుర్తు తెచ్చుకోవాలి)

## ప్రతిక్రమణ : దివ్యమైన క్షమాపణా విధానము

నేను దాదా భగవాన్ సాక్షిగా ❖...................... యొక్క మనోవచన కాయము కంటె పూర్తిగా వేరైన పవిత్రాత్మకు నమస్కరించుచున్నాను.

నేను నా తప్పులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను (ఆలోచన) ❖❖

ఆ తప్పులకై నేను క్షమాపణ కోరుచున్నాను (ప్రతిక్రమణ)

ఆ తప్పులను మరల చేయనని దృఢముగా నిశ్చయించుకొనుచున్నాను (ప్రత్యాఖ్యాన్)

ప్రియాతి ప్రియమైన దాదాభగవాన్! ఈ దృఢ నిశ్చయమును పాలించు శక్తిని నాకు అనుగ్రహించు.

❖ మీ వలన గాయపడిన వ్యక్తి పేరు

❖❖ ఆ వ్యక్తిపట్ల మీరు ఒనర్చిన దోషాలను గుర్తుచేసుకోవాలి.

# నవకలమ్

(తొమ్మిది ప్రగాఢ అంతరంగ భావనలు)

1. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ యొక్క అహాన్ని కొంచం కూడా బాధపెట్టకుండా, బాధ పెట్టించకుండా లేదా ఎవరినీ బాధించడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.

నేను ఎవరైనా దేహధారి జీవాత్మ యొక్క అహాన్ని కొంచం కూడా బాధించకుండా ఉండే స్యాద్వాదమైన వాణి, స్యాద్వాదమైన వర్తన మరియు స్యాద్వాదమైన చింతన చేసే పరమ శక్తిని ఇవ్వండి.

2. హే దాదా భగవాన్! నేను ఏదైనా ధర్మము యొక్క మాన్యతను కొంచం కూడా బాధ పెట్టకుండా, బాధ పెట్టించకుండా లేదా ఎవరినీ బాధించడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.

నేను ఏదైనా ధర్మము యొక్క మాన్యతను కొంచం కూడా బాధించకుండా ఉండే స్యాద్వాదమైన వాణి, స్యాద్వాదమైన వర్తన మరియు స్యాద్వాదమైన చింతన చేసే పరమ శక్తిని ఇవ్వండి.

3. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి ఉపదేశకులు, సాధు, సాధ్వి లేదా ఆచార్యులను అవర్ణవాదం, అపరాధం, అవినయం చేయకుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

4. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ వైపు కొంచం కూడా అభావము, తిరస్కారము ఎప్పుడూ చేయకుండా, చేపించకుండా, ఎవరినీ చేయడానికి అనుమోదించకుండా ఉండే పరమ శక్తిని ఇవ్వండి.

5. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మతో ఎప్పుడూ కఠోర భాష,తంతీలమైన భాష మాట్లాడకుండా, ఎవరినీ మాట్లాడేలా చేయకుండా, లేదా మాట్లాడడానికి అనుమోదించ కుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

ఎవరైనా కఠోర భాష, తంతీలమైన భాష మాట్లాడితే, నాకు మృదు-రుజు భాష మాట్లాడడానికి పరమ శక్తిని ఇవ్వండి.

6. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ వైపు, స్త్రీ, పురుషుడు లేదా నపుంసకుడు, ఏ లింగధారి అయినా సరే, వారికి సంబంధించి కొంచం కూడా విషయ-వికారానికి సంబందించిన దోషాలు, కోరికలు, చేష్టలులేదా, ఆలోచనలకు సంబంధించిన దోషాలు చేయకుండా, చేయించకుండా, లేదా ఎవరైనా చేయడానికి అనుమోదించ కుండా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

నాకు నిరంతరం నిర్వికారంగా ఉండడానికి పరమ శక్తిని ఇవ్వండి.

7. హే దాదా భగవాన్! నాకు ఏ ప్రకారమైన అభిరుచులలోను లుబ్ధము కాకుండా ఉండడానికి శక్తిని ఇవ్వండి. సంరసి ఆహారం తీసుకునే పరమ శక్తిని ఇవ్వండి.

8. హే దాదా భగవాన్! నేను ఎవరైనా దేహధారి జీవాత్మ, ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా ఉన్నా, జీవించి ఉన్నా లేదా చనిపోయినా, ఎవ్వరినీ కొంచం కూడా అవర్ణవాదం, అపరాధం, అవినయం చేయకుండా, చేయించ కుండా, లేదా చేయడానికి అనుమోదించకుండా ఉండడానికి ప్రరమ శక్తిని ఇవ్వండి.

9. హే దాదా భగవాన్! నాకు జగత్కల్యాణం చేయడానికి నిమిత్తం అవ్వడానికి పరమ శక్తిని ఇవ్వండి, శక్తిని ఇవ్వండి, శక్తిని ఇవ్వండి.

## తెలుగులో దాదా భగవాన్ పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| 1. | అన్ని చోట్లా సర్దుబాటు | 6. | చింత |
| 2. | విభేదాలను తొలగించడానికి | 7. | నేను ఎవరు? |
| 3. | ఎలాగైనా జస్టిస్ జరిగింది | 8. | భావనతో మెరుగుపడతాయి జన్మ-జన్మలు |
| 4. | బాధితుడు తప్పిదము | 9. | మృత్యు సమయం దానికి ముందు, దాని తర్వాత... |
| 5. | క్రోధం | | |

❖ తెలుగులో మరిన్ని పుస్తకాలు జోడించబడుతున్నాయి మరియు త్వరలో అందుబాటులోకి వస్తాయి.

## Books of Dada Bhagwan in English

| | | | |
|---|---|---|---|
| 1. | Adjust Everywhere | 19. | Money |
| 2. | Ahimsa: Non-Violence | 20. | Noble Use of Money |
| 3. | Anger | 21. | Pratikraman |
| 4. | Aptavani-1 | 22. | Pure Love |
| 5. | Aptavani-2 | 23. | Right Understanding to Help Others |
| 6. | Aptavani-4 | 24. | Science of Karma |
| 7. | Aptavani-5 | 25. | Science of Speech |
| 8. | Aptavani-6 | 26. | Shree Simandhar Swami : The Current Living Tirthankar |
| 9. | Aptavani-8 | 27. | Simple & Effective Science of Self-Realization |
| 10. | Aptavani-9 | 28. | The Essence Of All Religion |
| 11. | Autobiography of Gnani Purush A.M Patel | 29. | The Fault Is Of The Sufferer |
| 12. | Avoid Clashes | 30. | The Guru and The Disciple |
| 13. | Brahmacharya: Celibacy Attained with Understanding | 31. | The Hidden Meaning Of |
| 14. | Death: Before, During & After… | 32. | The Practice Of Humanity |
| 15. | Flawless Vision | 33. | Trimantra |
| 16. | Generation Gap | 34. | Whatever Happened is Justice |
| 17. | Harmony in Marriage | 35. | Who Am I? |
| 18. | Life Without Conflict | 36. | Worries |

❖ Dada Bhagwan books are available in different languages: Gujarati, Hindi, English, Marathi, Telugu, Kannada, Oriya, Malayalam, Bengali, Punjabi, Assamese, Tamil, German, Spanish, Russian, etc.

❖ 'Dadavani' Magazine is published every month in three languages: Gujarati, Hindi & English.

# దాదా భగవాన్ ఫౌండేషన్ తెలుగు యూట్యూబ్ ఛానల్

YouTube IN

Search

Dada Bhagwan Foundation • Adalaj

Dada Bhagwan Foundation Telugu

@DBFTelugu

dadabhagwan.org and 13 more links

Subscribed

HOME VIDEOS PLAYLISTS COMMUNITY CHANNELS ABOUT

Latest Popular Oldest

Aatmagnan se Aatma Sakshaatka... — 4.5K views • 1 month ago

Dukh ka Karan-... — 1.7K views • 1 month ago

Aatma Sakshatkar Kya he in Telug... — 125 views • 1 month ago

Aatma ka Anubhav in Telugu | Pujyashree... — 92 views • 1 month ago

❖ ఇది అడాలజ్ దాదా భగవాన్ ఫౌండేషన్ యొక్క అధికారిక తెలుగు యూట్యూబ్ ఛానెల్.

❖ దిగువ లింక్ నుండి తెలుగు భాషలో సత్సంగ వీడియోలను చూడండి.

**'Dada Bhagwan Foundation Telugu' Channel:**

https://dbf.adalaj.org/yttelugu



*Open Link OR*

*Scan QR*




---

*Dada Bhagwan Foundation Youtube video channels are available in other regional languages: Gujarati, Hindi, Marathi, Bengali, Tamil, Telugu, Kannada, Malayalam, Spanish, Portuguese, etc.*

# Persons to Contact

## Dada Bhagwan Foundation

**Adalaj** : **Trimandir**, Simandhar City, Ahmedabad-Kalol Highway
P/O: Adalaj, Dist. Gandhinagar - 382421, Gujarat, India.
Tel: +91-9328661166 / 9328661177
E-mail : info@dadabhagwan.org

**Mumbai** : **Trimandir**, Rushivan, Kajupada, Borivali (E)
Tel: +91-9323528901

| | | | |
|---|---|---|---|
| **Kolkata:** | 9830093230 | **Delhi:** | 9810098564 |
| **Jaipur:** | 9351408285 | **Chennai:** | 7200740000 |
| **Bhopal:** | 9425024405 | **Patna:** | 7352723132 |
| **Indore:** | 9039936173 | **Amravati:** | 9422915064 |
| **Raipur:** | 9329644433 | **Bangalore:** | 9590979099 |
| **Chandigarh:** | 9780732237 | **Hyderabad:** | 9989877786 |
| **Kanpur:** | 9452525981 | **Pune:** | 9422660497 |
| **Bhubaneswar:** | 8763073111 | **Jalandhar:** | 9814063043 |
| **Varanasi:** | 9795228541 | **Sangli:** | 9423870798 |

| | |
|---|---|
| **USA: Dada Bhagwan Vignan Institute**<br>Tel: + 1-877-505-DADA (3232)<br>Email: info@us.dadabhagwan.org | **U.K: Dada Darshan (UK)**<br>Tel: +44 330-111-DADA (3232)<br>Email: info@uk.dadabhagwan.org |
| **Germany** : +49 700 32327474<br>**UAE** : +97 1557316937<br>**Kenya** : +25 4722722063<br>**Dubai** : +971 501364530 | **Australia** : +61 421127947<br>**Singapore** : +65 81129229<br>**New Zealand** : +64 210376434 |

Website : www.dadabhagwan.org

## అన్నిమతాల సారాంశం!

క్రమిక మార్గంలో ఒకరు పెద్ద గ్రంథాలను చదువుతారు, అయితే ఇక్కడ (అక్రమ్ మార్గంలో), ఈ తొమ్మిది కలములు మాత్రమే చెబితే, చాలు! తొమ్మిది కలములలో ఇంత శక్తి ఉంచబడింది. అద్భుతమైన శక్తి ఉంది. ఈ తొమ్మిది కలములు గ్రంథాలు కావు. కానీ 'మేము' అనుసరించేది, మరియు ఎల్లప్పటికీ మా అమలులో ఉండేదే, మీకు చేయమని ఇచ్చాము. కాబట్టి ఇప్పుడు మీరు తొమ్మిది కలములు ఖచ్చితంగా చేయండి. మొత్తం వీతరాగ విజ్ఞానము యొక్క సారాంశం ఉంది ఈ తొమ్మిది కలములలో!

-దాదాశ్రీ



dadabhagwan.org



9 789391 375522

Printed in India

Price ₹30